మ. కనియుం బెంచియు విద్యబుద్ధియొసగం గానష్టకష్టంబులో
ర్చినమాతాపితలం గృతఘ్నుఁ డయి వంచింపం బ్రయత్నించు నా
జనకద్రోహి శిరంబు వ్రయ్యలుగఁ బర్జన్యుండ వంపు న్మహా
శనికోటు ల్యమునంతు రౌరవమున న్వాసించు నప్పాతకిన్.

అని నిష్ఠురంబుగాఁ బల్కుటయు నాకత్నితుంతు పెచ్చు పెఱిగిన మత్సరంబునం దనచేతి నిశితాసిధారనాయరక్షితగాత్రంబు గాడ సేసిన నేను మూర్ఛఁగంటి. నాపరవసంబున కొండె మీకోలాహలంబున కొండె వెఱచి యాపిఱికిపంద తత్క్షణంబ పలాయితుండయ్యె.

చంద్ర—శా. పోనిమ్మాఖలుఁ డెంతద వ్వరిగిన న్భూగర్భముం జొచ్చినం
గాన ల్పట్టిన నీట డాగిన నగాగ్రంబు ల్వెసం బ్రాకినన్
వానింబట్టి వధింతు నానృపశు నెవ్వండేనియుం డాచినన్
వానిం దోడనె రూపుమాపఁగఁ బ్రతిజ్ఞం బూనితి న్దీక్షమై.

చారులారా! నాప్రతిజ్ఞఁ బ్రకటించి, వానింబట్టి తెచ్చువాని కమూల్యం బగు పారితోషికం బొసంగంబడునని యెల్లచోఁ జాటఁబంపుఁడు.

దోషా—నే నెంత చెప్పినను దనదుశ్చింత విడువక కృతనిశ్చయుం డయి యున్న యాతని యునికిం జూచి నే నంతయు బయలుపుచ్చెద నని భయపెట్టిన నాతఁ డిట్లనియె. 'ఛీ దాసీపుత్ర! నేఁ గాదనుచుండ నీ వాడుమాట లెవరు విశ్వసింతురు? నీ వెంత రస పోషణ సేసి చెప్పినను నాచేవ్రాలుతోడి యుత్తరము సాక్ష్యముగాఁ గొని పలికినను, అదియెల్ల నీకృత్రిమము కా నందఱు విశ్వసించునట్లు చేయుట నా కెంతయు సులభసాధ్యము. ఎట్లంటివేని ప్రపంచము నెట్టిమందుఁ డయినను నానాశమువలన నీకుం జేకూరులాభము గ్రహింపలేకుండునా? అట్లుగావున నాప్రాణాపాయమున కయిన నీ వెట్టియుపాయములు పన్నుచుంటివని నేఁ జెప్పినను గట్టిగ నచ్చనివా రుందురు.

చంద్ర—ఔరా క్రూరకర్మా! ఎంతసాహసమున కయినం జాలుదువురా! ఏమీ వానివ్రాతే తనది కాదనఁ బూనెనా యాద్రోహి? ఆకులపాంసనుఁడు నావంశము చెడఁబుట్టినాఁడు. అల్లదె వర్ధమానుని ప్రవేశతూర్యంబులు కర్ణగోచరము లగుచున్నవి. కాని యాయనరాకకుఁ గతం బేమియో గోచరింపకున్నది. ఆదుర్మార్గుఁడు వెలుపడకుండ నిర్గమద్వారంబులకడం గావలివారి నిల్పెద. సార్వభౌముఁడు నిందుల కవశ్యము ననుమతించువాఁడు. ఇంతియే కాక వానిరూపురేఖ లెల్లరును గుర్తెఱుంగఁ జాలునట్లు పటంబున లిఖించి రాష్ట్రంబున నల్గడలఁ బ్రకటింపఁబడునట్లుగా నుత్తరువు సేసెద. పితృభక్తిసంపన్నుండ వగు నీవ నాసర్వస్వంబునకు స్వామి వయ్యెదవు గాక.

[మందరావర్ధమానులు సపరివారముగాఁ బ్రవేశించుచున్నారు.]

వర్ధ—ప్రియమిత్రమా! నే నిక్కడఁ జేరియున్న యీస్వల్పకాలములో నేవింతలు వింటిని.

మంద—అవి తథ్యం బగు నేని యాదుర్మార్గున కేమి దండన విధించినను దగిన నిష్కృతి గానేరదు. నేస్తమా భద్రమా నీకు?

చంద్ర—తల్లీ! నాహృదయ మవియుచున్నది.

మంద—ఏమీ నాతండ్రి శిక్షను జెరిగిన స్వేతకీర్తియే జనకద్రోహము దలంచెనా?

చంద్ర—ఏమి చెప్పుదు తల్లీ! తలంపునకు వచ్చినఁ దలఁపు వాటిల్లుచున్నది.

మంద—కాకేమి? దురద్ధతు లగునాతండ్రి పరిజనులసహవాసము సంఘటించు వాఁడు దేనికి సాహసింపఁడు.

చంద్ర—నా కావిషయ మంతగాఁ దెలియదుగాని తెలిసినది వాఁకొన వాయి రాకున్నయది.

దోషా—తల్లీ! అతఁ డాసమాజకములోనివాఁడే.

మంద—సహవాసమున దోషము లబ్బు టొకయబ్బురమా? ఆయుక్కివులు వానిం దమవానిం జేసికొని వానితండ్రిసొత్తు విచ్చలవిడిగా వెచ్చపెట్టునన్దేశముతోఁ దండ్రి వధకు వానిం బ్రేరేపించియుండఁబోలు. వానిచర్యలనుగూర్చి యీప్రొద్దు నాతోఁబుట్టువు నాకు జాబు వ్రాసినది. వాఁడు నాయొద్దకు వత్తురేని నేను మొగము దప్పింప నిశ్చయించుకొంటిని.

వర్ధ—నానిశ్చయము నంతియ. దోషాకరా! నీవు నీతండ్రియెడలఁ బరమభక్తి యుక్తుఁడవయి ప్రవర్తించినట్లు విని సంతసించితిని.

దోషా—అయ్యా! అయ్యది నావిధియేకద.

చంద్ర—ఖడ్గనైపుణ్యము మెఱయించి వానింబట్టి గమగించి ప్రేటుపడియె. కంటివా యీగంటు.

వర్ధ—వానివెనుకొన భటులం బుత్తెంచితివా?

చంద్ర—అటు లొనర్చితిని.

వర్ధ—వాఁడు చేఁ జిక్కినా వానిపలసిభయము మిఁక లేకుండు నుపాయము నీకుం దోఁచినభంగి నొనర్పుము దానికెల్ల నేఁ బ్రాపయ్యెద.

ద—దోషాకరా! నీవు ధర్మవర్తనంబు మెఱయం బితృభక్తి నెఱపి మాయనున

గ్రహంబు వడసితివి. మా కీ యదనున విశ్వాసపాత్రం బగుత్వాదృశభృత్యవర్గంబు వశ్య సంపాద్యనీయంబు. నిన్నుం దొలుత స్వీకరించెదను.

సోమ—తమకుంగలసామర్థ్యంబు లెట్లున్నను, మదాయత్తంబు లగుభక్తివిశ్వాసంబులం గొఅంత లేకుండ సేవాధర్మము నిర్వహించెద.

చంద్ర—వానిని దయఁజూడుఁడు.

వర్థ—చంద్రసేనా! అస్మదాగమనంబునకుఁ గతం బెఱుంగుదువా?

మంధర—

మ. కడుమర్గాప్రియ్యము హైనకార్యగతులం గన్గొమతు ల్దక్కి చే
సెడికార్యంబు గ్రహింపఁజాల కిట నీచేఁ దీఱ చిక్కుంచు నీ
నడుమేయిం గనుగాలుసాగి కదలంగారాని కెంజీకఁటిం
బడి యే మిచ్చటి కేగుదేరవలసె న్మాకార్య మూహింపుమా.

గీ. నాదుజనకుండు నాజ్యేష్ఠసోదరియును
వైమనస్యంబు లాత్మలఁ బాదుకొనిన
జాబు లంపిరి వేర్వేర జాగుసేయ
కుచితగతి నీయవలె వారి కుత్తరములు.

వ—కాన నీవు సద్బుద్ధి నూహించి కర్తవ్యంబు నిశ్చయించి మాకుం బరమహితం బుపదేశింపుము.

చంద్ర—ఆవశ్యమును నా నేర్చినకొలంది నట్లొనర్చెదను.

రంగము—చంద్రసేనునినగరు ముంగిలి.

[సుమిత్రుఁడును గుక్షింభరుఁడును వేర్వేరఁ బ్రవేశింయుచున్నారు.]

కు—మిత్రమా! భద్రమా నీకు? నీ విచ్చటివాఁడవే?

సుమి—ఔనౌను.

కు—గుజ్జనుల నెచ్చట విడియింతము.

సుమి—ఆగొతిలో.

కు—దయచేసి మాట సరసముగా రానిమ్ము.

సుమి—నీకును నాకును జుక్కెదురు. దయ యెక్కడిది?

కు—అట్లేని మాయింటికి మీయి లెంతదూరమో మీయింటికి మాయిల్లు నంతియు దూరము. నా కేల నీయెడల లక్ష్యము?

సుమి—బాహ్యారామనాటికయందు నాచేఁ జిక్కువడవేని నీ కెంత లక్ష్యమయి గఱపిపుచ్చుదురా తుచ్ఛా!

కు—నీ మొగమైన నెఱుంగని నన్నేల నీ విట్టి యవజ్ఞపాలు సేసెదవు.

సుమి—నన్నెఱుఁగవేమో కాని నిన్ను నే నెఱుంగుదును.

కు—ఎవనిగా నన్నెఱుంగుదువు.

సుమి—నీవా? తుంటరివి, తులువవు, దొంగవు, పందవు, సోమరివి, జూదరివి, పరమశుంఠవు, పశుప్రాయుఁడవు, ఇందొకయక్షర మయినను గాదనియెదవేని పడఁ దన్నెదను.

కు—నీ మొగము నే నెఱుంగను. నా మొగము నీ వెఱుంగవు. నీ కేల యిట్టి మౌర్ఖ్యము?

సుమి—ఛీ! సిగ్గులేక ప్రేలెదవు. నీవు నాచూ పెఱుఁగకున్నను తో పెఱుఁగవా? మొన్నటిసంగతి యింతలోనే పరగడుపునకు వచ్చినదా? (కత్తిదూసి) ఛీ! దుశ్చరితా! వాలు కేలఁగొని రక్షించుకొనుము.

కు—నీతో నాం కేమి? (సాగిపోవుచున్నాఁడు.)

సుమి—నిలునిలు మోరిదురాత్మా! నాబాఱింబడి యెందుఁ బోఁగలవు. తండ్రి బిడ్డల కనుబంధవిచ్ఛేద మొనర్చు లేఖాహరణదుష్కర్మమునకుం బాపెద.

కు—రక్షింపుఁడు రక్షింపుఁడు.

సుమి—నిలునిలు మోరిపాతకీ! (కొట్టుచున్నాఁడు)

కు—కటకటా! ఈమూర్ఖునిచే మడియవలసివచ్చె. ప్రాణదానం బొసంగి రక్షింపుఁడు రక్షింపుఁడు.

[కృపాణపాణులై దోషాకరుఁడును, వర్ధమానుఁడు, మందర, చంద్రసేనుఁడు,
పరిచారకులును ప్రవేశించుచున్నారు.]

దో—ఏమేమి సమాచార మేమి?

సుమి—గోమునం బెఱఁగితివి. నీక్రొవ్వణఁగింతు రారమ్ము.

చంద్ర—అయుధపాణులై సత్వరముగ రండు. ఏమిసమాచారము.

వ—విరమింపుఁడు కానిచో మీకలహంబు మీప్రాణంబులతోఁ దీరెను. ఈసారి చేయెత్తినవానికి మరణమే దండనము.

మంద—వీండ్రు మాతండ్రి తోఁబుట్టువులతావునుండి వచ్చినదూతలు.

వ—మీకలహమునకుం గారణమేమి?

క—మహాప్రభూ! నాకు శ్వా సాడకున్నది.

సుమి—పాపము బలవిక్రమములు నూపి చాల డస్సితివి. ఛీ పాపుబోతా నిన్ను మగవానిగా విధాత తప్పఁజేసెను.

వ—మీాయిరువురకును వైర మేల పొసఁగినది?

క—ఈమొరకుముదుకని పలితశిరంబుఁ జూచి యీతని ప్రాణాపాయంబునకుం దెగనోడితి.

సుమి—ఓరిపక్షీ! నావార్ధకము చూచి జాలిదలఁచినావఁటరా? అయ్యో! నెల వయిన నీతనిబీరంబు లుడిపెద.

వ—చాలుచాలు. ఏల మర్యాద యెఱుంగక మాటలాడెదవు.

సుమి—అయ్యా! ఆగ్రహ మెల్లరకును మర్యాదోల్లంఘనోపాధ్యాయుఁడుగద.

వ—నీయాగ్రహమునకుం గారణం బేమి?

సుమి—ఈపిటికిపంద కేల గన్నట్టునావా లే చాలినంత కారణము వే రొండేల?

మ. మది హాలాహలము స్ముఖంబున సుధామాధుర్యముం గల్గి సు
పద వెన్వెంటను వంటయింటివెనుక న్వ్యానక్రియం జొచ్చి యె
య్యదియుం దోఁచక తిన్నయిండ్ల కలహప్రారంభము ల్నాటుచుం
డెడు రీతుచ్ఛులు వీండ్ర యిచ్చకములం జేటొందు సంసారముల్.

ఛీ! దురాత్మా నీ వీయూరివెలుపలఁ దారసించితివేని నీరూపు మాపకుందునే?

వ—ఓరి స్థవిరాధమా! నీకు మతిపోయినదా?

చంద్ర—మీాకలహకారణము దెలుపుమన ఈయకాండతాండవ మేల!

సుమి—మాయిరువుర ప్రకృతులకు తూర్పుపడమరలకుఁ గలయంతరము గలదు. ఈమహాత్మునకును నాకును గలపొత్తు వేనీళ్ళకును వేసవికాలమునకు నెంతయో యంతియ.

వ—అపరాధకారణము నిరూపింపకయ యేల వాని నింతదూఱెదవు.

సుమి—వానిమొగము చూచిన నాయరకాలిమంట నెత్తి కెక్కుచున్నది.

వ—అయితే మామొగములఁ జూచినను నీకట్లే యుండఁబోలు.

సుమి—కల్లిపమాట గట్టిగాఁ జెప్పుట నానైజము. మాకాలమున మేము చూచిన తలలకు సాటి యీాతన్నట్టు మెడలపై నొకటియుఁ గానరాదు.

వ—లోక మిట్టిపలుగాకులను యథార్థవాదులని పొగడుటయే యిట్టిప్రల్లదనము నమఁ బట్టుగొమ్మ. తాను మోమోడక కలరూపువచించువాఁడఁట. నేనిట్టితులువలఁబలువురఁ

జూచితి. జిహ్వాయందెప్పుడును యథార్థవాదప్రశంసకుం గొదువలేదు. హృదయములు మాత్రము కౌటిల్యమునకుఁ బుట్టినిండ్లు. ఇట్టిడొకనియందు వినయవిధేయతలతోఁ బనులు సేయు సూత్వారయం దుండువానికంటె వేయిమడుంగు లెక్కుడు కౌటిల్య ముండును.

సుమి—అట్లయినచో మహాప్రసాదము. భానుకోటిప్రభాభాసమానతేజోవిరాజ మానా! అవధరింపుము.

వ—ఈప్రలాపమున కర్థ మేమి?

సుమి—దేవా! దేవరచిత్తానుసారము నావచోధోరణి సవరించికొనుచున్నాను. కాని ముఖప్రీతులకును నాముఖమునకును సగ మెరుక. నాయెత్తుధనమువోసినను నిన్ను వలలోనికి దించిన పచ్చికవాండ్ర యిచ్చకములును మచ్చులాడితనములును నా కలవడవు.

వ—(కుక్షింభరునితో) నీవు వాని కేమి యపరాధ మొనర్చితివి.

కు—నే నేమియు నొనర్చుటలేదు. వీఁడు దుర్మంత్రమువలన వీనియజమానుఁడు నన్నుం గొట్టినాఁడు. అటుపైన వీఁ డిచ్చకాలకు మరలిపోవుచున్న నన్నుం దన్ని తన్నుపడి పడియున్న నాపై నెంతయుఁ బ్రతాపము సూపి తనయజమానుని మెప్పువడసె. ఇప్పుడాయుబ్బున నీయెడ నాయెడల విక్రమమున కుపక్రమించెడిని.

సుమి—ఆహా! ఏమిరా ప్రజ్ఞలు. ఉత్తరమునకడ కొత్తినాఁడవు.

వ—బొండకొయ్యఁ దెండు. వీనికండకావరమునకుం దగుచికిత్స సేయవలసి యున్నది. పదరుబోతా నీయుదుటు మాన్పి యడఁకువ నేర్చెదను.

సుమి—అరువదేండ్లు పైబడినవి. చదువు నేర్వనిదియే యదను. కాని యుచిత మారయుము. మీమామగారు పుత్తెంచినమాత్ర కిట్టిసత్కార మొనర్చి తిరిగి యాయనమో మెట్లు చూచెదవు.

వ—బొండకొయ్య సత్వరముగాఁ గొనిరండు. రెండుజాములపరకును వీనిపదముల గదియించి యుంచుఁడు.

మం—రెండుజాము లేల పగలు నాల్గుజాములు కలయునెడ రాత్రియంతయు నుంచుఁడు.

సుమి—అమ్మా నేను నీతండ్రివాకిటికుక్కనైనను నన్నిట్లు చేయఁదగదు.

మంద—కానీ యామనుజసింహునిపాలి నక్కవగుట నిన్నిట్లు చేయవలసినదే.

వ—వీఁడు చండికచే వర్ణింపఁబడినతుంటరిమూఁకలో నొకఁడయి యుండవచ్చు. బొండకొయ్యఁ దెండు. (బొండకొయ్యఁ దెచ్చుచున్నాఁడు.)

చంద్ర—మీ రీతని కీర్తిహీనదండన మిచ్చి యనుచితమునకుం జొరకుండుఁడు. ఈతని యపరాధ మెంతదుర్భర మయినను రాజధానికిం దగుపరిహార మొనర్ప నర్హుఁడు. మన మీతని యనుచరు నవమానించినచో నది రాజున కెంతయు నాగ్రహకారణ మగును.

వ—దానికెల్ల నే నుత్తరవాది నయ్యెద.

మంత—అంతియే కాదు. తనపరిచారకునకు గల్గినపరాభవము మాతోఁ జెప్పవు నకుమాత్ర మాగ్రహకారణము గాకుండునా? వీని నవశ్యము బంధింపుఁడు. శంకింపనేటికి! (సుమిత్రుని బంధించుచున్నారు) ప్రాణనాయకా! పోదము రమ్ము. (సుమిత్రుఁడును జంద్రసేనుఁడును దక్క తక్కినవా రందఱు నిష్క్రమించుచున్నారు.)

చంద్ర—మిత్రమా! నీయవమానమునకు నామనం బెరియుచున్నది. కాని యలంఘ్యశాసనుం డగువర్ధమానుని యుత్తరువు మరల్ప నెవరివశము. అట్లయ్యు నాయోపినంత యత్నం బొనర్చెద.

సు—నేస్తమా! నీకేల యట్టిప్రయాస. ప్రయాణముచే నలసిన నాకీనిర్బంధరూప మగుశ్రమాపనోదనసాధన మమరినది. నేనుం గొండొకసేపు సుఖనిద్రగూరి యధ్వఖేదం బపనయించుకొనియెదఁగాక. నీ విందులకు వగవక పోయిరమ్ము.

చంద్ర—అయ్యో! వర్ధమానుఁ డిట్టి యనుచిత మొనర్చినాఁడు. రా జెంత కోపించునో గదా. (నిష్క్రమించుచున్నాఁడు.)

సు—ఓ వెఱ్ఱిరాజా! సుఖమున నున్న ప్రాణమును దుఃఖమునఁ బెట్టికొంటివి. వియన్మంటప లంబమానరత్నదీపమా! ఇందుబింబమా! ఉదయించుచుంటివా? త్వత్ప్రకాశసాహాయ్యమున నే నీలేఖం జదువుకొనియెద. ఆహా! విపద్దశ గదా విస్మయావహము లగునవశములకు జన్మసీమ. మాదురవస్థఁ దెలిసికొని సుశీల తీరిక చేసికొని తత్పరిహారదత్తచిత్తయయి యీలేఖ నాతావున కంపినది. కన్నులారా! బడలియున్నారు. నిద్రాలాభముచే నాదైన్యము నుపలక్షింపకుందురుగాక. భగవతి! లక్ష్మీ! అనుజ్ఞ యొసంగుము. భవదీయకటాక్షవీక్షాలాభంబు మరల మాకగుంగాత. (నిష్క్రమించుచున్నాఁడు.)

రంగము—ఒకయడవి.

[శ్వేతకీర్తి ప్రవేశించుచున్నాఁడు.]

శ్వేత—సీ. ప్రభుశాసనముఁ బూని పల్లెలు పట్టణంబులు మాడెములు కొట్టములు నగళ్లు
కానలుకోనలు ఘనలతాగుల్మముల్ గర్తంబులును గిరికందరములు

రేయుంబవళ్లు వేరోయుచు నాతలఁ దరిగి సమర్పింపఁ దిరుగ రాజ
పురుషుల గుజగుజ ల్వరఁగ నే నొకజీర్ణతరువివరంబున దాగి వింటిఁ
గాన వారికి నామూర్తిగౌరవంబు
మరుగుపడ రోంపిమోమునఁ జరచి దిన్న
మొలకు మసిపాతఁ జుట్టి యొాదలను జడలు
ముడిపడంగ నమర్చ్బెద బూచివోలె.

తే. గీ. వేష మీరీతి ధరియించి వెట్టివాని
పగిది వికవిక నవ్వుచు వాడవాడ
సెంగిలాకులఁ బొడగన్న నేరి మెతుకు
లోలి మెసవుచుఁ గ్రుమ్మరుచుండు నిందు.

ఇఁక నే స్వేతకీర్తిని గాను పాతలభైరవుఁడను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

రంగము—చంద్రసేనునినగరుముంగల.

[సుమిత్రుఁడు బొండకొయ్యతో నుండఁగా మందపాలుఁడు, విదూషకుఁడు,
మరియొక పెద్దమనుష్యుఁడును బ్రవేశించుచున్నారు ]

మంద—నాదూతమ ప్రత్యుత్తర మిచ్చి పంపకయ వార లిలువెడలిపోవు టెంతయు నాశ్చర్యావహముగ నున్నది.

పెద్ద—నేవిన్న సమాచారమునుబట్టి యోచింపఁగానిన్న టిరేయివచ్చినను వారెకుం డావు వచులునుద్దేశము లేనట్టు స్పష్టమగును.

సుమి—స్వామీ! వందనము.

మంద—అకటా! నీ కీయవమాన మొకవినోదముగా నున్నదా?

సుమి—మహాప్రభూ! అట్లేలయగు.

విదూ—గుఱ్ఱములకుఁ దలకట్లు, కుక్కలకు మెడకట్లు, కోఁతులకు మొలకట్లు

మంద—ప్రమత్తుఁడయి నిన్నిట్లు పరిభవించినవాఁ డెవఁడు?

సుమి—అవియును వాఁడును గూడియే యింత సేసిరి. నీయల్లుఁడును గూఁతురును గూడియే.

మంద—అట్లయియుండ దని నాయనుమానము.

సుమి—అట్లయ్యెనని నా ప్రమాణము.

మంద—అట్లేల యగు?

సుమి—అట్లే యయినది.

మంద—దేవునియాన! వారొక్కనాఁటి కట్లు చేసియుండరు.

సుమి—దయ్యముతోడు! నిస్సంశయముగా వారే యిట్లు చేసినారు.

మంద—చేయ వారికి చేతు లెట్లొచ్చె. మానవంతున కీర్తి యవమానముకంటె ప్రాణహాని మేలు. మాదూతవగు నీ కీర్తిపరాభవంబునకుం గారణంబు నీదౌర్జన్యమో వా సౌజన్యమో శీఘ్రముగా నిరూపింపుము.

సుమి-శా. నీసందేశము మాళిఁ దాల్చి యిటకు న్నే వచ్చి నేఁ దెల్పుచో
నాసానాళముల న్నిరంతరగతి న్గంపించు శ్వాస ల్నిజా
యాసంబుం బ్రకటింప శీఘ్రగతి నత్యంతంబు స్విన్నాంగుఁడై
డాసెం జండికక్రోమోలనుండి వెనువెంట న్దూత సోత్కంఠుఁడై.

గీ. నన్ను కడకొత్తి చండిక విన్నపముగ
జాబు లొకకొన్ని యందివ్వఁ జదివి వార
లాక్షణంబున నిల్వాసి యరుగు నెడలఁ
దోడ రమ్మని సెల విచ్చి రీడకునను.

నేను వారివెంటఁబడి వచ్చి యిట నిద్దురాత్ముం గని యంతకుమును నీయెడ నవినయంబు సూపిన యాచెనఁటింగా నెఱింగి, నాహృదయంబునం బొంగి పొరలుచరోషంబు నామనంబున దూరవిచారబుం బొదివి ముంపఁ గత్తి దూయుటయు నిప్పిటికిపంద భయగద్గద స్వరంబున విపర్యాసంబుగా నార్చె. అంత నందఱును మూగి ననుం జుట్టుముట్టిరి. నీ యల్లుండును గూఁతురును నాయందు నేరమువెట్టి యిట్టిపరిభవంబు విధించిరి.

విమా—తే.గీ. ధనము నాసెడుతండ్రులు లాత్మజుల భువిని
గడుఁ గృతఘ్నులఁ గావింత్రు కల్ల గాదు
ధనము దాఁచెడు తండ్రులు లాత్మజుల ధరణిఁ
గడుఁగృతజ్ఞులఁ జేతు రీనుడువు నిజము.

రాజా! నీకొమార్తెయే నీకుం జింతారత్నములుసుమీ.

మంద—విచారసాగరమా వెల్లిగొనకుము. నాకుమారీరత్న మెక్కడ?

సుమి—ఆమె భర్తతో నంతిపురమున నున్నది.

మంద—నీ విట నుండుము. (నిష్క్రమించుచున్నాఁడు.)
పెద్ద—ఇదియేనా నీవు చేసిన నేరము ?
సుమి—మరేమియును లేదు. రాజేలయింత హ్రస్వపరివారముతో వచ్చినాఁడు?
విమా—చాలుచాలు. ఈ ప్రశ్నకయినను నీ వీపరిభవమున కర్హుండవు.
సుమి—ఏలరా యవివేకీ.

విమా—శీతకాలమున పాటులేదని తెలియఁజాలని నిన్ను చీమయొద్ద శిక్ష కంప వలెను. ముక్కునను సూటిగాఁబోయినం గన్నుగలవానికిం గనుఁబడనిదేమి? శుక్ల పక్షముం గృష్ణపక్షముం దెలియని శుద్ధమూర్ఖు లుందురా? కొండ క్రిందికి దొర్లుచక్రముం జేపట్టిన మెడవిఱుగఁబడుటయే ఫలము. కొండ పైకిఁ బ్రాకుదాని పట్టుదొరికిన నగ్రము జేరవచ్చును. ఇంతకంటె శ్రేష్ఠ మయినయుపదేశ మొకఁడు చేసినపుడు నాది ఖా కప్ప గింతువుగాని లే.

[మందపాలుఁడు చంద్రసేనసమేతుఁడై తిరిగి ప్రవేశించుచున్నాఁడు.]

మంద—నాతో మాటాడుటకే యోపిక లేదా? ఏమీ రాత్రియంతయు ప్రయా ణము చేసి డస్సినారా? చాలుచాలు నీవ్యుత్పత్తులు. నీవు పోయి సదుత్తరముఁ గైకొని రమ్ము.

చంద్ర—వర్ధమానుని యహంకారము మీ రెఱింగినదే కదా! ఆతనిపట్టునకు విడుపు లేదు.

మం—క. పరమద్రోహులు దుష్టులు
దురితాత్ములు మోసరతులు దుర్మార్గులు దు
ర్మణం బయ్యెడు వీరికి
నిరయంబు నికృష్టజన్మనిష్ఠయుఁ దోడ్తోన్.

ఏమీ అహంకారమా? చంద్రసేనా! నీవు పోయి మందపాలుఁడు మందరావర్ధమానులతో మాటాడ నుత్సహించుచున్నాఁ డని చెప్పుము.

చంద్ర—ఆసంగతియే మనవి చేసినాను.
మంద—ఏమీ! మనవియా? ఎవరితో భాషించుచుంటివో గుర్తెఱుంగుదువా?
చంద్ర—చిత్తము. ఎఱుంగుదును.

మంద—రాజు వర్ధమానునితోడను తండ్రి తనయుతోడను మాటాడవలసియున్నా డని తెలియఁజేసి వారిరువుర నిట రమ్మని నాయాజ్ఞగా వచింపుము. ఇది యొకమనవి

గాఁ జెప్పితివా? వర్ధమానుఁ డహంకార మెవరిపైఁ జూప నున్నాఁడు. ఆప్రల్ల దీని యుల్లంబు వ్రచ్చిపో నిట్లాడుము. తాళుము—తొందర వలవదు. నిరామయుని బోధించు విధులు సామయునియందుఁ గుంఠితము లగుట న్యాయ్యంబకదా. శరీరము వ్యాధిపీడిత మయి యుండునప్పుడు బుద్ధివికాసము వీడియుండును. కావున నాయుద్రేకమునకు శాంతి చెప్పకొనియెద. (సుమిత్రునివంకఁ జూచి) నాయధికార మేలఁ గాల్పవా? వీఁడేల యీశీల నవమానముపాలు గావలసె? బాగుగా విచారింపఁగా నిల్లు వదలివచ్చుట మొదలగు వీరిచర్య లన్నియు దురుద్దేశపూర్వకములగాఁ దోఁచుచున్నయవి. ఈక్షణంబ నా కింకరునకు విడుగర యొసంగి వా రిరువుర నామ్రోల నిల్పుము.

చంద్ర—నాశక్తియుక్తుల వినియోగించి సాధ్యమయినంతవఱకు ధీమానుఁ బొందొనగూర్ప యత్నించెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

మంద—హృదయమా! శమింపుము.

విదూ—క్రింద యెసరుపెట్టి పైన నీళ్లు చల్లుము.

[వర్ధమానుఁడు మంథర చంద్రసేనుఁడును బరిచారకులును బ్రవేశించుచున్నారు.]

మంద—మీయుభయులకు నాయుస్సమగు.

వ—వందనము. (సుమిత్రుఁడు విడువఁబడుచున్నాఁడు.)

మంద—భవద్దర్శనచంద్రోదయము నాలోచనచకోరంబుల కెంతయు సంతోషావహముగ నున్నది.

మంద—అస్మజ్జాత వగు నీకట్లుగా కెటు లుండు. (సుమిత్రునితో) స్వేచ్ఛఁ బడసితివిగదా? నీసంగతి కావల వచ్చెదను. అమ్మా మంథరా! నీతోఁబుట్టువు కేవలము వ్యర్థురాలు. దానికృతఘ్నత పాముకోరలవలె (హృదయముఁ జూపుచు) నిట నాటినది సుమీ. ఆమె దుర్ణయము వర్ణింప నాకు నోరురాదు. నీవీనులును విననొల్లవు.

మంథర—అయ్యా! ఓపిక సేయుఁడు. మీ రామె యవజ్ఞమాట యటుండనిండు. తత్స్వభావానభిజ్ఞతచే మీ రింత చేసియుందురని నాయూహ.

మం—ఏమీ నీయభిప్రాయము?

మంథర—నా యగ్రజాతకృతఘ్నురాలయి యుండదు. తనగృహసంతోషోపశాంతికయి యీకుటిలమూఁకను బ్రోత్సహించిన నామెయం దదేటి దోషమగు?

మం—ఆ రాకాసిమారి బారిం బడుఁగాక!

మంథర—అయ్యా! అయ్యా నీవు కాలముతీరి కాటికిఁ గాళ్లు చాచుకొని యున్నావు. నవనాళ్లును దిగియుంటివి. నిన్నొరులు నీక్షేమమును గోరువారు నడుప

వలసియున్నది. కావున నామాట విని నాయకుని సన్నిధికిఁ బోయి జరగినదానికిం బరిహారము సేయుము.

మం—ఆమెయొద్ద నిలిచి "అమ్మా! నేను మూడుకాళ్ళముదుసలిని వ్యర్థుఁడను. ఏలాగునవో కూడుగుడ్డ యిచ్చినా ముప్పు గడుపుము" అని వేఁడుమంటివా? అది మన కుటుంబగౌరవమున కెంత యనురూపమో, ఆమె కెంత శ్రేయోదాయకమో నీవే విచారింపుము.

మంథర—అయ్యా! చాలు నిఁక మాటలు కట్టిపెట్టి యామెయొద్దకు జాగు సేయక వెడలుము.

మం—ఉ. ముక్కున యాపిరుండ నలమూర్ఖశిరోమణిపాలి కేగి యే
దిక్కును లేనివానివలె దీనతఁ గాలముఁ బుచ్చు టెట్టు లా
యుక్కివురాలు నాభటుల నూరక నేరము పెట్టి సాముగా
నక్కట! చేసె దాని కిల నాయువు శ్రీయును జెల్లకుండునే.

వ—అయ్యా మీ కిటులాడ నో రెట్లు వచ్చినది.

మం—మ. అశనివ్రాతము దానిమస్తకము వ్రయ్యం దాకెడు న్నాదుదు
ర్దశ లెల్లం గుమిగూడి యట్టులయి తన్నస్త్రంబున వ్రాలె నా
దిశల న్మేచకదేహకాంతు లొలయన్ దృప్తాత్త నాశ్వాపదిన్
గశల న్మోదుచుఁ గాలుదూతలు యమాగారాతిథిం జేసెడున్.

మంథర—హరిహరీ! నివ్వెరిముల్లంత తప్పినచ్చో నాగతియు నిట్టిదెకద.

మా—అమ్మా! నీవిషయమయి యట్లేల సంభవించు. ఈనీముఖువర్ఛస్సా మెదాని వలెఁ దీక్ష్ణముగాక దయారసముఁ జిలుకుచున్నది. ఆమెవలె

మ. పరివారంబు సగం బొనర్చి పటువాక్పారుష్యముం జూపి మ
త్పరమప్రీతికరంబులౌ పనులకు న్భంగంబు గావించి యా
దర మొక్కింతయు లేక యి ల్వెలువడ న్ద్వారంబు బంధింప నీ
తర మా టెట్లు దయాశమాదిగుణభద్రాపుత్రికారత్నమా!

మంథర—చిత్తము. ప్రకృత మనుసరించి పలుకుఁడు.

మం—నాభృత్యు లెవరు బంధించిరి? (లోన తూర్యధ్వని)

వ—ఆతూర్యము లెవరివి?

మంథర—నాకు గుర్తే. మాయక్కగారివి. వ్రాసినట్లే యామె విచ్చేసినది.

[కుక్షింభరుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మీప్రభ్వి యెక్కడ ?

మం—ఈ బానసీని కతిచను విచ్చి యింత మితిమీర నిచ్చినారు. ఛీ తుచ్ఛుఁడా పొమ్ము. నాకనులం బడకుము.

వ—దేవరవారి కంతయాగ్రహ మేల ?

మం—ఎవరు నా సేవకుని బాధించిరి. మందరా నీవు గావని నానమ్మకము. (చండిక ప్రవేశించుచున్నది.) దైవమా! ఎవరీ ప్రవేశించువారు. నావార్ధకమందు నీకు దాక్షిణ్యముండిన నిప్పాపాత్త న్విడనాడి ననుం జేపట్టుము. (చండికతో) నానెరిసినగడ్డముఁ జూచిన నీకు సిగ్గుపుట్టదేల ? ఏమీ మందరా నీ వా పెచెట్ట వట్టుచుంటివా ?

చం—ఏల పట్టరాదు ? నావల్ల నేర మేమి ? జరాచాపల్యముచే మతిదక్కి నీవు నిరూపించినదెల్ల నేరమగునా ?

మం—హృదయమా! వ్రయ్యవేల ? నా యనుచరు నెవరు బంధించిరి ?

మందర—అయ్యో! నేను. అతని నేరమునుబట్టి చూడఁగా నేను జాల దాక్షిణ్యమునే గనుపఱచినట్లు తేలఁగలదు.

మం—నీవా బంధించితివి ?

మందర—అయ్యో! దయచేసి యీ యుంగ్రోపము చాలించి మరలిచని నిలిచిన యీ సగము పరివారముతో నాతోఁబుట్టువునొద్ద నీమాసావశేషంబుం బుచ్చిరమ్ము. నాకిప్పు డీపరస్థలమున నీకర్హసత్కార మొనర్ప నవకాశము లేదు.

మం—సగము పరివారమును డించి యామెకాళ్ళఁ బడుమంటివా ?

మ. గృహవాసంబుఁ ద్యజించి కాన మునిభంగి స్సీతవారాతప
ప్రహతిసైన్తు మహోగ్రసింహశరభవ్యాఘ్రాదిదుస్సత్వదు
స్సహదంష్ట్రాహతిఁ జత్తు సిగ్గటి యజస్రం బానుశీలాపటిక్
బహుళాయాసము సేసి కొల్తు వసియించం జాల నాకూళతోన్.

చం—అట్లయిన నీచిత్తము.

మం—నాకుఁ జిత్తవిక్షేప మొనర్పకుము. నీ నాయెడలఁగల యనుబంధములు నేఁటితో సరిపెట్టుకొందము. మనకుం జూపు లింతటితోఁ జెల్లుఁగాక. సరియేకాని నీవు నారక్తమాంసములవలన నేర్పడిన తనూజాత వగుట నా కత్యంతంబును షమత్వపాత్రం బవు ? దానికేమి దుర్మాంసమును వ్రణము నీదృశములేకదా. నిన్ను నిందింప

నేల. లోపముండుపట్టునం గాలాంతరమునఁ బశ్చాత్తాపము తనకుందాన యుదయించును అట్లు గాకుండిన నేకష్టమును నిప్పుండిన నాకష్టమే యంటుకొనుగాక. ఒరులకుం గీడు గోర నాకేల? ఈనూర్వురు పరిజనులతోడను నేను మందరపాల నుండెదను.

మందర—మీ రెంతమాత్రము నట్లనఁ గొనంజనదు. నే నిప్పటికి మీ రాకకు నిరీక్షించుకొని యేమియు సిద్ధపరచుకొనలేదు. కావున నామనవి విని మీరు నాయక్క యొద్దకు మరలి చనుఁడు. ఇప్పటి మీ భంగిఁ జూచిన నిది యంతయును మీజరాచాపల్యమే కారణముగాఁ గన్పట్టెడును. ఆమెవిధు లామె యెఱుంగదా?

మం—ఉచితానుచితము లరసి పల్కుము.

మందర—మనఃపూర్తిగా నట్లరసియే పల్కుచుంటిని. ఏఁబదుగురు పరిజనులు నీకేలఁ జాలదు? ఏకాగారంబున బహునాయకానువర్తు లగుపలువురు పరిజనులకుం బొందుపొసఁగు టెట్లు?

చం—నాపరిజను లుండఁ బెరజనులతో నేమిపని? పనియుండిన నిం డెవరివలనఁ బనిగొనరాదు.

మందర—ఔనౌ నట్లేలఁ జేయరాదు. వారలయందలి ప్రమాదాలస్యాదులకే మహాదండన మొనర్చువారము. కావున మీరు నాయొద్దకు వచ్చునప్పు డిరువదియైదుగురిని వెంటఁగొని రండు. అంతకధిక మయిన ననర్థము లనేకములు పొడకట్టుచున్నవి.

మం—నాసర్వస్వమును మీయధీనము సేసితిని.

మందర—ఉత్సాహము జనించిన నట్లు సేసితివి.

మం—నాకును నాసర్వస్వమునకును మిమ్ము సంరక్షకులఁగా నంగీకరించునెడ నీ స్వల్పపరివారమును మాత్రము నిల్పుకొంటిని. అట్టి నే నిప్పుడు వీరిలో ముప్పాతికపాలు గోలుపోయి నీపాలికి రావలయునా? ఇట్టిమాట నీకుం బోలునా?

మందర—పోలకేల?

మం—లోకములో బట్టైన మ్రింగువానికంటె గొట్టైన మ్రింగువాఁడు మేలు. (చండికతో) ఆమె యిరువదియైదుగురికి నీయేఁబదుగురు ద్విగుణము గాన నీపాలికే వచ్చెదను.

చం—అమ్మా! నావిన్నపము వినుము. ఏఁబదిమాట యటుండనిండు. మీ కిరువదియైదుగురుగాని, పదుగురుగాని, యేవురైననుంగాని యేలవలయు? మీయాజ్ఞ కెదురుమాడు నాపరిజనులు వేవురుండ నొరు లేల?

మందర—ఒకఁడుగూడ ననావశ్యకము.

మం—ఆవశ్యకతకు వ్యవస్థ యేడ? అది విచారించినచో క్షుద్రుఁడగునరునికిచనుని వేషమున నతిక్షుద్ర మయినదానియందుఁగూడ ననావశ్యకత సమర్థింపవచ్చును. జనుల యీప్సితము లావశ్యకత మించకుండునేని లోకమున జనులకు జంతుకోటికివలెనే ఘటయాత్ర బహుసులభసాధ్య మగును. ఆచ్ఛాదనముననే పరిధానప్రయోజనము పర్యాప్తం బగునేని, ఆయాచ్ఛాదనమును సమగ్రముగా నొసంగని మీయమూల్యాంగవేష్టనముల యావశ్యకతను మీ రెట్లు సాధింపగలరు? నాకేల మీతోడ నింతయుక్తివిచారము. దైవమా! జరాజీర్ణశరీరుండనై, దుఃఖోద్విగ్నమానసుండనై, యాధివ్యాధిపీడితుండ నగు నాకు క్షమం బ్రసాదింపుము. కానిచో నాహృదయంబు నబలాజనోచితదైన్యంబునకుఁ బాల్పరుపక పురుషజనోచితరౌద్రావేశవశం బొనర్చి యాకృతఘ్నుల యర్హదండనవిధానసంరంభంబునకుం బురికొల్పుము. అట్లయిన నీపాపకర్మురాండ్ర రూపుమాపు ఘోరకర్మంబుల నాకసిదీర నొనర్చి లోకమునకు బుద్ధి సెప్పెద. కాక నాకేల నిట్లు వేలపడ విదూషకా నాచిత్తము చంచలించుచున్నయది. (రాజు, చంద్రసేనుఁడు, విదూషకుఁడు, సుమిత్రుఁడును నిష్క్రమించుచున్నారు. గాలియు వానయుఁ బ్రారంభించుచున్నది.)

వ—గాలివాన పట్టుచున్నది లోనికి రండు.

మందర—ఇల్లు చిన్నదిగా నున్నది. రాజు పరివారంబునకుం జోటు చాలకుండి యుండును.

చం—ఎవరు చేసికొన్నది వా రనుభవింపక తీరదు.

మందర—అతఁ డొకఁడైన గ్రహింతునుగాని యింకొకనిం గొనను.

చం—నాయభిప్రాయము నంతియ. చంద్రసేనుఁ డేడ?

మం—తనప్రభువువెంట జని యదె మరలి వచ్చుచున్నాఁడు. (చంద్రసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

చం—రాజు రౌద్రావేశవశుండయి యున్నాఁడు.

వ—ఎట కేగనున్నాఁడు.

చం—ఎట కేగనోగాని గుఱ్ఱముల సిద్ధము సేయించుచున్నాఁడు.

వ—ఆయనచిత్తవృత్తిని నిర్నిరోధముగ సాగనీయవలెను.

చండిక—చంద్రసేనా! ఆయన నెన్నటికిని బ్రతిమాలకుము.

చం—రాత్రియయినది. గాలివానసాగినది. మాపుమేరలో చెట్టును బుట్టయు లేక బట్టబయలుగా నున్నది.

మం—బుద్ధిపూర్వకముగఁ జేసికొనువారికిం దమచెయ్వులఫలములే హితోపదేశకములుగాఁ గలయవి ద్వారము బంధింపుఁడు. ఆతండు దుష్టపరివేష్టితుండు. చిత్తము చపలస్వభావము. లోఁ జొచ్చిన నేమి వచ్చునో.

వ—మంపరపలుకు లెంతయు నుచితంబులు. ద్వారము బంధించి ఝంఝానిలంబునకుం దొలంగుదము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

శ్రీ

# మందపాల చరిత్రము.

## తృతీయాంకము.

రంగము — ఒకబయలు.

[గాలివానలో సుమిత్రుఁడు ప్రవేశించుచుండఁగా నొకపెద్దమనుష్యుఁడు
వచ్చి చేరుచున్నాఁడు.]

సు — ఈగాలివానకుఁ దోడెవరిక్కడ మసలుచున్నారు.

పె — ఈబహిఃప్రకృతిలోవలెనే యంతఃప్రకృతిలో సంక్షోభము నొందుచుండు నొకఁడను.

సు — నేను గుర్తించితిని. ప్రభు వెక్కడ?

పె — ఈమహాభూంతసంక్షోభముతోఁ బెనంగుచు భూమినెత్తి సముద్రమునఁ గలిపి యొండెను గాని చో సముద్రమునెత్తి భూమినిముంచి యుండె నీదుర్నయప్రపంచప్రలయ మొనర్పుమని ప్రభంజనుం బ్రార్థించుచు నీభూంతములకంటె రౌద్రతరమగుమూర్తివిశేషము దాల్చి శిరోవేష్టనము నంగరక్షయులేక తెరువను జొచ్చి ఘాతుకమృగములుసయితము పొడసూపవెఱచు నీనడిరేయిం బెన్బయిట విడిసియున్నాఁడు.

సు — ఆయనతోడ నెవరున్నారు?

పె — ఆయన హృదయాంశ్లేష మొనర్చునుద్వేగము హాస్యా! నీకుం దనమృతి నిర్వహింపుముచే శాంతి యొసంగం జూచు విదూషకుఁడుదక్క నొరు లెవ్వరును లేరు.

సు — నిన్ను నెఱుంగుదు. భవత్పరిచితజనితవిస్రంభంబున నిన్నొక్క కార్యంబున నియోగింపం గుతూహలం బయ్యెడు. వర్ధమానసితధ్వజులకుం గలతలు బలుపయ్యెనుగో ష్యముచే వెల్లడిగానున్నయది. కాని వారల పరిజనులదార్ఢ్యతంత్ర్యముపలన వారికలహాగతులు సమయమ్మానయుఁ డగుప్రభువును వారొడంబఱచిన పరిభవము నింకనుం గల రాజ్యకార్యరహస్యమును యెప్పటికప్పుడు విపరముగా మాళవేశునిచెవులం బడుచునే

యున్నవి. అట్లగుటం జేసి నీతివిశారదుం డగు నిమ్మాళవుండు రహస్యప్రయాణంబుల సేసల యమునాకచ్ఛంబున నిగూఢగతి న్విడియించి తోడ్తోన బయలు వెఱయ నవకాశము సేసియున్నాఁడు. నన్ను విశ్వసించి నీ వాసేనా నివేశముం జేరి రాజునకు చిత్తాపస్మారకారణం బైన యీన్యూనత సవిస్తరంబుగా విన్నవింతువేని యిహపరంబుల రెంటను ధన్యతం గాంతువు.

పై—మీ రింత విశ్వసించిన నే నేల విశ్వసింప కుందును?

సు—అట్లయిన నిఁక మాటలేల? ఈక్షణమే బయలుదేరుము. నీకనఁ లంబడు నీ నికృష్టదేహికి భిన్నుండఁగా నిన్నుం గ్రహించుటకై యీధనకోశంబుం బ్రమాణంబుగాఁ బరిగ్రహింపుము. నీకు సుశీల కనులంబడినప్పుడు నీవీముద్దుటుంగర మామెకుం జూపిన నీ కపటుఁడుగాని యీయాచకించినవేషధారియొక్క కులగోత్రంబుల కలరూపామె నీకుం జెప్పెడు. బిట్టుగుఱియు నిష్పాపిష్టివృష్టింబడి ప్రాణములు గడవట్టుచున్నవి. నేఁ బోయి ప్రభువునేమ మారయవలెను.

పై—మహాప్రసాదము. నాకనుజ్ఞయొసంగుఁడు. ఇంకను విన్నవింపఁగల వేమేని యున్నచో సెలవిండు.

సు—చెప్పమాటలు పెక్కు లేవుగాని చేయఁ గార్య మెంతైనఁ గలదు.

(వేర్వేర నిష్క్రమించుచున్నారు.)

రంగము—బయట మఱియొకచోటు. గాలివాన సాగుచున్నది.

[మంద పాలుఁడును విమూషకుఁడును ప్రవేశించుచున్నారు.]

మం—చ. తరువులుగూలవీచుతను దారుణభంగి సమీరణుండు చం
దురు గబళించికార్మొగులుతోయములం భువి ముంచుగాత వి
స్ఫురిత తటిల్లతాతతులు చూడ్కులకుం మిఱుమిట్లు గొల్పుతం
ధర నురుమాడుగాత ప్రతతం బగుపిల్లల పిడ్గుతండముల్.

వి—ఓయిరాజా! అభిమానమునకుంబడి యీబయిట నీజడిమడియుటకంటె వారలపాలఁబడి తలదాఁచికొన సెలవు వడయుము. ఈపాడుగాలివాన నీయట్టిబుద్ధిమంతులను గాని నాయట్టిబుద్ధివిహీనులనుగాని సరకుగొనకున్నయది.

మం—చ. కురిసెడుగాక పిడ్గుగమిగోత్రసువృష్టి యఖండధారగా
దొరిగెడుగాక మీరెడల దోషము వెట్టఁ ఘనంబులార నా

కరితురగాదిసంపదలుగాని వసుంధరగాని మీకు నే
నరణ మొసంగలే దిల దయామతి నన్గని రక్ష సేయుమీ.

చ. శిరమున భారమెన్నగను జీమతలంతయు లేదుగాని ము
ష్కరులగు నాదుసుద్ధతులకక్షిసె జేరి జరాభరంబునం
గరము కృశించి చిక్కువడి కాటికిఁ గాల్గవ సాచు నాపయిం
బరవస మిట్లొనర్చుట నవశ్యభవద్ఘనతానురూపమే.

విదూ—తలదాఁచికొనుట కిల్లుగలవానికి శిరస్త్రాణముతోఁ బనియేమి?

మం—నాబుద్ధికి బుద్ధిచెప్పుకొని యోరిమిదాల్చి యూరకుండెద.

[సుమిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సుమి—ఎవ రక్కడ?

విదూ—వివేకియు నవివేకియు.

సుమి—మ. అకటా ప్రానతవైరిభీరమకుటానర్ఘస్ఫురద్రత్నగాం
తికలాపామలదీపికాచయసమున్నీరాజితాంఘ్రిద్వయీ
ప్రకటశ్రీయుతినోలగంబుల వసింపంగన్న నీ కియ్యెడన్
వృకభల్లూకములుం జారస్వైరచు పెన్పుష్టిన్ నిశిం బైట నూ
రక నిల్వన్ వలసెం బురాకృతము దుర్లంఘ్యం బదే వారికిన్.

శా. ఈనీరంధ్రనిరంతరాంబుపతనం బీవిద్యుదుత్సేపణం
బీనిర్ఘాతపరంపరావిలసనం బీమేఘగర్జారవం
బే నెన్నండును బుద్ధెఱింగి కనలే దెందున్ మహావిస్మయా
ధీనం బయ్యెడు మన్మనంబు పెనుభీతి న్మేను కంపించెడున్.

సీ. ఈభూతసంక్షోభ మిట్లు గల్పించిన దేవతలార మీద్వేషు లిపుడు
మీప్రభావం బాత్మ మెచ్చి పశ్చాత్తాపతప్తులౌదు రెగాక తల్లడించి
ఘోరదుష్కృతముల గుటిలురై మది నిల్పి ప్రభుదండనము దాటి పాపులెల్ల
నెదలఁ గాలుష్యముల్ నుదుటి భస్మత్రిపుండ్రకరేఖలను గప్పి సకలఖలులు
చౌర్యముల్ గూటవృత్తులు జారతయును
హత్యలాదిగ గనుగప్పి యాచరించి
సుఖముగను భ్రాంతి మనియెడు నఖిలజనులు
వంచనలు వీడి వేఁడు డీశ్వరుని నేఁడు.

సుమి—అరక్షితం బగునీశిరంబేల యీసంతతధారాపాతంబున కొడ్డెదవు? ఈ చేరువ జీర్ణగేహంబున్ జేరి విశ్రమింతువుగాక. ఆగృహస్థులహృదయము లాగృహ కుడ్యగతశిలాసంఘాతంబుకంటెను కర్కశతరంబులు. ఏనిన్నన్వేషించుచు వచ్చునప్పుడు మోసలం జేరి ఎంత పిల్చినను పల్కం దీయరయిరి. నేనప్పటికి మున్నుగాం బోయి వారినిర్దయహృదయంబుల కొంత సౌహార్దంబునకుం బదునుపరచెద.

మం—నాచిత్తము చలించుచున్నయది. విదూషకా! రమ్ము. గతిలేనివానికి గంజి పానకమయినట్టు నీవు నాకిపుడు పరమాప్తుండవును, కేవలబంధుఁడవు నయితివి. నాహృదయము దానికిం గల్గినసంక్షోభములో నీదురవస్థనుమాత్రము కొంత స్మరించును గాని కడమయంశముల నన్నిటిని పూర్ణవిస్మృతిపాలు చేసినది. ఏదీ యాజీర్ణగేహము?

విదూ—కాలము తప్పివచ్చినప్పుడు కాలోచితవర్తనమున కొడికట్టవలెను.

మం—సత్యమురా సోమరీ! ఏడ నాగేహమేడ?

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

రంగము—చంద్రసేనుని నగరు.

[చంద్రసేనుఁడును దోషాకరుఁడును బ్రవేశించుచున్నారు.]

చంద్ర—దోషాకరా! ఈదుర్ణయము తలంచిన నాతల కంటకించుచున్నది. పాహ మాపవిత్రశిరస్కునిపై యనుకంప దోప నేం బల్కినంతమాత్రాన నాయింటికి నాయాజ మాన్య ముడిపి తాళములం దమస్వాధీనము చేసికొనిరి. ఇంక మీఁద నేనట్టిప్రశంసకుం జొత్తునేని నేను తమయమోఘాగ్రహంబునకుం బాత్రుండ నగుదు నని పల్కి నన్నా ప్రసక్తినుండి సత్రాసంబు విరమింప శాసించిరి.

దోషా—ఆహా! ఎంతవిపరీతము. పశుప్రాయులుగాఁ దోఁచెడిని.

చంద్ర—పెక్కు భాషింపకుము. వర్ధమానసితధ్వజులకు వైరములు ప్రాఁగినవి. ఇంతకంటెను గొప్పమోసము మఱొకటి జరుగుచున్నది. నాకావిషయమయి వార్త వచ్చినది. ఇది పరమరహస్యము. జాబు నాపెట్టెలోఁ బెట్టియుంచినాను. రాజునకు జరగిన యవజ్ఞకుఁ బ్రతీకారమొనర్ప మాళవబలంబులు కొన్ని మనరాష్ట్రమున విడిసి యున్నవి. సన్నాహము సర్వమును సిద్ధమయినప్పుడు మనము ప్రభుపక్షము నవలంబింప వలయును. నేను ప్రస్తుత మాయనను రహస్యప్రకారంబునం గని యథోచితముగా సత్కారంబు నెరపెద. వర్ధమానునియొద్దకుం బోయి రహస్యంబు బయలుపడకుండ

సందర్భోచితముగాఁ బ్రసంగించుచుందుము. నాస్తికగతుల నరయునేని నే నిదురించుచుంటి వని యుండెడి, దేవాస్థానము దక్కియుంటినని యొండెడి జెప్పెదవుగాక. నే నీ జోక్యము పైఁ బెట్టుకొనిన నాకు మరణదండన విధింతు మనిరి. ప్రాణహాని యైనను వార్ధకమునం బ్రభువు కష్టములకుం గాకుందునా? దోషాకరా! రానున్న సంక్షోభములలో జాగరూకుండవై మెలంగవలెను. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

దోషా—ప్రసిద్ధమగు నీప్రభుసత్కారమును పేటికాంతర్నిక్షిప్తమగు నాలేఖా వృత్తాంతమునుగూడ వర్ధమానునకు నివేదించి ఆయనప్రసాదమునంబడసి యీమదుకని సర్వస్వమునకు నేన స్వామి నగుదునుగాక. ఒకని యస్తమయముగదా మఱియొకని యభ్యుదయమున కవకాశ మొసంగుచున్నది.

(నిష్క్రమించుచున్నాఁడు.)

రంగము—జీర్ణగేహము నెదుట.

[మందపాలుఁడు, సుమిత్రుఁడు, విదూషకుఁడును బ్రవేశించుచున్నారు.]

సుమి—ఇదియే గృహము. దయచేసి యిందుఁ బ్రవేశింపుఁడు. గాలివానదెబ్బనుఁ దల వాయుచున్నది.

మంద—నాజోలికి రాకుండుఁడు.

సుమి—నామనవి విని యిందుఁ బ్రవేశింపుము.

మంద—హృదయమా! అవియుచుంటివా?

సుమి—నాహృదయ మవియుఁగాక! నీ విందుఁ బ్రవేశింపుము.

మంద—ఈదారుణవృష్టి శరీరమునకుఁ జేయుపీడ నీ శోకఘనముగా నెంచుచుంటివి. నీ కట్లే యయియుండును. అధికార్తి గందు వాని కిట్టియల్పపీడ నాఁటు టెట్లు? భల్లుక మభిముఖ మయినప్పుడు నీవు మరలి పారచూతువుగాని నీవెనుక మిన్నందియొరయు సముద్ర మడ్డముండినచో భల్లుకమువాతఁ బడుటయే శ్రేయమని యెంతువు. మనస్సునకు ప్రశాంత మొదవియున్నప్పుడు శరీరమునకు సౌకుమార్యము సాగును. హృదయవీధి ఘనసంక్షోభము సాగినప్పుడు వినువీధి ఘనసంక్షోభ మెవఁడు పాటిసేయును. హా! జనకద్రోహమా! నీనోటి కన్నము నందిచ్చు హస్తమును దెగగొరుకుటగదా నీకు పరమధర్మము [illegible]లనయి కంట తడిపెట్ట నేలి దీని కర్హదండనమును సంపాదించెను. కటకటా! ఇట్టిబెట్టిదపురేయి నన్ను విడనాడితిరే! ఓచెండికా! ఓమందరా! ఆతలంపు స్మరణమందే రాదు. చిత్తము చంచలించెడును.

సుమి:—ఆమాత్యా! దయచేసి లోన కరుగుము.

మంత—శీఘ్ర ప్రవేశించి తల దాఁచికొనుము. నా కీవర్షమే యుపకారకారక మైనా దున్నది. నాకు చిత్తచాంచల్య మొదవింపఁజాలు విచారాంతకముల కవకాశ మీయకున్నది. కాని నీకునయి నేలోని కరిగెద. ముందు విదూషకుఁ బంపుము.

[విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ఉ. అకటకటా మనం బెరియు నాకటికిన్ మెతుకైన లేక పే
దికలు మొలం ధరించి ధృతి లేశము వాసి పడళ్లు రేలు నూ
రక పురవీధులం బడి నిరంతర మాతపవాతవర్షబా
ధకుఁ దల దాఁచఁగా నెలవు దక్కక చరించెడువారి నెంచినన్.

ఉ. కల్మిని గన్నుగానక జగంబున దీనులయార్తి నంతయున్
దెలియక దీర్ఘకాల మిటు దృప్తుఁడనై వృథపుచ్చితిన్ దుదిన్
గలిమి తొలంగి కష్టములు నాటిన నచ్చెడు తథ్య మెల్ల నీ
యిల మనుజాళి కాపదలహీనహితప్రతిపాదకంబులౌ.

[శ్వేతకీర్తిలోనుండి జయభైరవా (విదూషకుఁడు పైకిఁ బరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు.)]

విదూ—రాజా! యిటు రాకుము. లోన భూత మున్నది.

సుమి—నీప్రాణములకు నాప్రాణముల నడ్డపెట్టెదను. ఎవరు లోపల?

విదూ—భూతము పేరు పాతలభైరవుఁడఁట.

సుమి—ఈగడ్డిలో నేమి నెమకుచున్నావు? వెలుపలికి రమ్ము.

[ఉన్మత్తవేషముతో శ్వేతకీర్తి ప్రవేశించుచున్నాఁడు.]

శ్వేత—పిశాచమా! తెగటార్తును. ఎవరుమీరు? ప్రాణముల కాశింతురేని తొలఁగి చనుండు.

మం—ఏమి? నీసొత్తెల్ల పుత్రికల కిచ్చి యీదుస్థితి జెందితివా?

శ్వేత—ఈభైరవున కేమయిన దానము చేయువా రున్నారా? వీని నొక బ్రహ్మరాక్షసి జలంబుల ముంచి మంట నార్చి అడుసున నదిమి యంత్రబోను పడక క్రింద వాల్లెమును బ్రక్కను బాకులు నొడ్డియు గంజిలో విషము గల్పియు నిద్రించు నెడ గొంపోయి కొండకోనలను బెట్టి బొమ్మలను నిల్పియుఁ బలుబాధలు పెట్టుచున్నది.

మంత—ఏమి యీపాపము! కూతుం డ్రీతని నీస్థితికిఁ దెచ్చిరి కాఁబోలు. ఓరీ! కానయినను నిల్పికొనక కడగి పెట్టితివా?

విదూ—అదిగో మేఁల కొకకంబళి నిలుపుకొని తనమానమును మనమానమును నిల్పి నాఁడు.

మంద—నీకొమార్తెల మారి గొంపోవుగాత

వి—వానికిం గూఁతుండ్రు లేరు.

మం—లేనిచో వీని కిట్టిదుర్దశ యెక్కడిది? ఓరీ! నీపుట్టుఁబూర్వము లేమిరా ?

శ్వేత—నేనును బూర్వము పెద్దలపరిచర్య చేయునెడ మీసము వడిద్రిప్పి తల కుచ్చుకుళాయియు వంటికి మెర్గుటంగియు దాల్చి తిరిగినవాఁడనే. స్త్రీలౌల్యమునఁ బతానుల బరిహసించితి. పానాశక్తిపాశ్చాత్యులఁ దిరస్కరించితి.

మం—ఏమయినను నేమి నేఁటి కీగతి ప్రాప్తమయినదిగదా! వానిం జూడుఁడు. పుట్టినవాఁడు పుట్టినట్లున్నాఁడు. పశులఋణ మీతనికి కొంతయును లేదు. వీనికయి యూర్ణనాభిపట్టును అజావులన్నియు శుక్తికముత్యములును పునుఁగుపిల్లి పునుఁగును కస్తూరిమృగము కస్తూరియు నొసంగుటలేదు. వసనాచ్ఛాదనాదివిరహితుఁడై పట్టుకాసు వలె రెండుగాఁ జీలినకోళ్ళతో నెట్టు గన్పట్టుచున్నాఁడో చూడుఁడు. మఃకుమాత్ర మేల యూతొడుగులు సడలింపుఁడు (అని తనవలువ లూల్చుచున్నాఁడు.)

వి—రాజా! ఉపశమింపు ముపశమింపుము. చూడు. అల్లదె కొఱవిదయ్యము వచ్చుచున్నది. (కఱ్ఱదీపముతోఁ జంద్రసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

శ్వే—ఈదయ్యము రెండవజామున లేచి కోడికూఁతవఱకును దిరుగుచూ పిల్లలను మెల్లకండ్లును ప్రేలుంబెనవులును, కుక్కలకు ప్రేలుంజెవులును, మేకల మెడలఁ దప్పచన్నులును, వరిచేలకు దూసరకంకులును, కొబ్బరిచెట్లకు దయ్యపుకాయలును, గల్గించుచుండును.

సు—ఎవ రావచ్చువారు?

చంద్ర—మీ రెవరు. మీపేళ్ళు సెప్పుఁడు.

శ్వే—పాలభైరవుఁడు నా పేరు. చిరుకప్పలు, బోదురుకప్పలు, జల్లలు, నాకాహారము. నాకడుపులోని కాలరుద్రుఁడు మండుచున్నప్పుడు నాకు గోమయపిండముల పూపములు చచ్చినయెలుకలును, పక్కలును, పింజీవంటలు. పసరుగలసిన పాడుపల్వలములోని యుదకమ్ము పానకము.

చంద్ర—మహాప్రభూ! వీరా నీయనుచరులు.

శ్వే—పాతాళభైరవునికంటె పెద్దమనుష్యులుందురా!

చంద్ర—మహాప్రభూ! మనముగన్న సంతానము మనశరీరమునుండి నిష్పన్నమైన దుర్మాంసముతోఁ దుల్యమై మన కగ్గువలంచుచున్నది.

స్వే—నాగుండె ఝల్లుమనుచున్నది.

చంద్ర—దేవా! నాతో విచ్చేయుము. నిన్ను వెలిబుచ్చి ద్వారము బంధింపవలసినదిగా నీకూఁతుండ్రు నన్ను శాసించిరిగాన నావిధినే గుర్తెఱిఁగి నిన్ను వెద! కొనుచు వచ్చినాను. నాతో విచ్చేయుదువేని భోజనపానాదిసంపన్న మగు నొక తావునకున్ గొంపోయెద.

మంత్రి—మొదల నన్నీతత్త్వజ్ఞునితో సంభాషింప నిందు విడుగులకేమి కారణము.

సుమి—నామనవి విని వారిప్రార్థన నంగీకరించి యాయనతోఁ జనుము.

మంత్రి—ఈజ్ఞానితోఁ గొంత మాటాడవలసియున్నది. మీరు ప్రస్తుతము చేయు విచార మేమి?

స్వే—పిశాచములఁ దొలంగించువిషయమును, మూషికాదుల సంహరించు విషయమును.

సుమి—రమ్మని బలవంతపెట్టుము. అతనిమతి చలించుచున్నయది.

చంద్ర—అది యాతనిదోసమా! తుఱవలగు నాతనికూఁతుండ్రాతని యసువులకు బాప సమకట్టుచున్నారు. హా! సుమిత్రుఁడా! నీ విప్పు డెచ్చటనుంటివో గదా! కినాటి నీవచనములు వేదవచనము లయి నేఁడు గన్పట్టెడు. ఈరాజు మతిచెడునని చెప్పియుంటివి. ఇతనికే కాదు. నాకును మతిపోయినది. నాకూర్మితనయుఁ డొకఁడు నాయుసురుకొన సమకట్టి తనయుద్యమము వెల్లడియయినం బలాయితుండయ్యె. వానిని మదనంతరకర్తృత్వంబునకును రాజరక్షణకును బాపి తద్గ్రహణార్థము రాజభటుల నియోగించితిని.

స్వే—నాయొడలు వలిదాకుచున్నవి.

చంద్ర—లోనికిం జని చలికిం దొలంగుము.

మంత్రి—అంపరము బ్రవేశింతము.

సుమి—అయ్యా! యిటు రమ్ము.

మం—ఏడీ నాతత్త్వజ్ఞుఁడు.

సుమి—వానింగూడ దోడ్కొనిపొమ్ము. కాకుండిన ఆయనకు మనస్సమాధాన ముండదు.

చం—అవశ్య మట్లొనర్చెదను. (అని అందఱును నిష్క్రమించుచున్నారు.)

రంగము—చంద్రసేనుని నగరు.

[వర్ధమానుఁడు దోషాకరుఁడును బ్రవేశించుచున్నారు.]

వ—నే నీనగరు విడిచిపోవకపూర్వమే చంద్రసేనున కర్హదండనము విధింపవలె.

దో—కేవల ప్రభుభక్తిపరాయణుఁడనై పితృభక్తి యుజ్జగించినందుల కెంతయు లోకాపవాదపాలౌదు నను తలంపు మనసునకు వచ్చినపుడెల్ల నా కొడలు జల్లు మనుచున్నది.

వ—నీ యన్నను నీతండ్రివధకుఁ బ్రేరేపించినది కేవలము వానిదౌష్ట్యమే కాదు. నీ వాయవసరమునఁ బ్రకటించిన పితృభక్తి తనయుద్యమమును గాలహరణము గాకుండ నెరవేర్చుట యుచితమని నీయన్నకుఁ దోఁచునట్లు చేసెఁ గావలయు.

దో—నాయదృష్ట మేమోకాని నేను న్యాయపథ మవలంబించినందుకుఁ బశ్చాత్తాపపడవలసివచ్చుచున్నది. ఆయన ప్రశంసించినలేఖ యిదిగో. దీనిం బట్టి నమాళవుఁడు మనరాష్ట్రమున వసియుంచగల్గుట ఆయనతోడ్పాటువలననే జరిగినట్లు తెలియఁచున్నది. దైవమా! ఇట్టిరాజద్రోహచింత జనుగకుండినను, జరిగినచో నామంత్రభేదము నీకుఁ గారణమునే గాకయుండినచో నామనస్సున కిట్టిసంక్షోభము గల్గకుండును గదా.

వ—నాతోడ రమ్ము మందరపు నీయోగ్యతను దెల్పెదను.

దో—ఈలేఖయందలి వృత్తాంతము నిజమే. మీకుఁ జేతినిండ పని సమకూడినది.

వ—నిజమైనను గల్లయైనను చంద్రసేనుని సర్వమునకు నీవ కర్తవైతివి. అతని జాడ గనిపెట్టుము. వెంటనే భటులఁ బుచ్చి పట్టి తెప్పించెద.

దో—(స్వాగతము) రాజు నాదరించుచుండఁగ నే పట్టి యిచ్చెదనేని వర్ధమానునకు నామాటలన్నియు గట్టిగా నచ్చగలవు. వర్ధమానునియెడఁ బ్రభుభక్తినాటకము కొంతవరకు సాగింపవలసి యున్నది. కాని యిందలి కృతఘ్నత నాహృదయమున కెంతయు వెక్కసముగానున్నది.

వ—నీ వింతటినుండి నావిశ్వాసమున కెంతయుఁ బాత్రుఁడవైతివి. నీతండ్రివాత్సల్యమునకుం బాసితివని చింతింపకుము. దానికంటె నధికమగు నాప్రేమకుం బాత్రంబవైతివి. (అంతట నిష్క్రమించుచున్నారు.)

రంగము—చంద్రసేనుని నగరుసమీపమున నొకపశువులసాల.

[చంద్రసేనుఁడు, మందపాలుఁడు, సుమిత్రుఁడు, విదూషకుఁడు,
స్వేతకీర్తియును బ్రవేశించుచున్నారు.]

చం—ఆబట్టబయలుకంటె నీశాల కొంత మెరుఁగుగదా. ఇందుఁ బ్రవేశింపుఁడు. నేనుబోయి నాకు లభ్యమైన కొన్నియుపకరణములు గొనితడవుసేయక మిముఁ జేరెదను.

సుమి—అతనిమతి చాలభాగము చెడినది. ఈయుపకారముల కీశ్వరుఁడు నిను దయఁ జూచుఁగాత. (చంద్రసేనుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

స్వే—నన్ను భేతాళుఁడు పిల్చుచున్నాఁడు.

వి—రాజా! పిచ్చివాఁడు పెద్దమనుష్యుఁడా లేక పిన్నమనుష్యుఁడా?

మం—రాజు! రాజు.

వి—నీకుఁ దెలియదు. పిచ్చివాఁ డెవ రనఁగా పిన్నలకుఁ బెత్తన మిచ్చిన యాబేలమనుజుఁడు. కోమటివిశ్వాసమును, గోమలినిజమును, జారజుని పితృభక్తియుఁ గల్లకుఁ గల్ల.

స్వే—నన్నుఁ బిశాచ మావేశించుచున్నది.

మం—న్యాయనిర్ణయము చేయవలసియున్నది. (స్వేతకీర్తితో) ఓధర్మనిర్ణయకాగ్రణీ! నీవీయుగ్రాసనము నధిష్ఠింపుము. (విదూషకునకు) ఓవివేకనిధానమా! నీవీపీఠమున నిల్వుము. ఏకీ యాజిత్తులమారినక్కలను బిలువనంపుఁడీ. (సుమిత్రునితో) ఓప్రాడ్వివాకోత్తమా! నీ వీయాసనము నలంకరింపుము. ముద్దాచండిక నేరము విమర్శింపుఁడు. ఈన్యాయసభ యెదుట నే ప్రమాణపూర్వకముగాఁ జెప్పుచున్నాను. ఈమె తండ్రి యగు రాజును బడఁదన్నినది.

విదూ—ఓమానినీ! యిటురమ్ము. నీపేరు చండికయేనా?

మం—ఎట్లు కాదనఁగలదు?

విదూ—అయితే సరే. చండాలి యనుకొన్నాను.

మం—ఇదిగో యీమెను విచారింపుఁడు. ఈమె కుటిలవీక్షణము లీపె హృదయగత మగు గాపట్యమును బైలుఁబెట్టుచున్నవి.

సు—ఏమో యోరిమిగల్గి యుండెదనంటివా యోరిమియేడ?

స్వేత—(స్వగతము) నాకన్నులఁ గ్రమ్మునీరు నానటనమును బైటపెట్టునట్లున్నది.

మం—ఈపక్కులన్ని నాపై మొఱగుచున్నవి. అల్లదె పులియఁడు బూచి గాఁడు వేపిగాఁడు.

శ్వేత—ఇదిగో పాఱఁదోలుచుంటిని.

తే. గీ. భైరవుండు కంటఁబడినంతమాత్ర నే
పాఱిపండ నిల్చి బ్రదుక నెట్లు
కచ్చుపక్కి లాడిని గొంపోవుపక్కులు
జాతిపక్కులు బలుజాగిలములు.

మం—మందరహృదయమును శోధింపుఁడు. ప్రకృతిలో నట్టిహృదయమునకు పాదానకారణములుగాఁ గలపదార్థ లుండునా ?

సుమి—అయ్యా! విశ్రమింపుఁడు.

మం—సద్దు చేయకుఁడు. నిద్రించి రాత్రి లేచి చల్దిఁ గుడిచెదను.

వి—నేను పగలు పాన్పుఁ జేరి పవ్వళించెదను.

[చంద్రసేనుఁడు తిరిగీ ప్రవేశించుచున్నాఁడు.]

చం—మిత్రమా! ప్రభు వెక్కడ?

సు—ఇక్కడే నున్నాఁడుగాని యతనిమతిపోయినది. అతనిఁ గదలించకుము.

చం—నెచ్చెలీ! అతనియుసురుగొన నొకకుట్ర నడచుచున్నది. యాదృచ్ఛికముగా నాచెవులం బడినది. ఇఁక నిచ్చట మసలినయెడల నతనికిని నతని కుపకారమొనర్చు మనకును బ్రాణహాని యవశ్యము. కావున నాతని నెత్తుకొని నావెంట వత్తురేని నీకుఁ గొంతబాసట యొసంగుదు. అటుపయిన నాతని మోచికొని కురుక్షేత్రము వైపునకుం బోవుదురేని యచట మీకు స్వాగతమును సురక్షితయును జేకూరఁగలదు.

సు—క్లేశపడి నీప్రాణములు విశ్రాంతికిం జొచ్చినవి. ఈవిశ్రాంతి నీప్రకృతిక్షోభంబునకుం గొంత యుపశాంతి యొసంగవచ్చు. కాని యదియుం సాగ నవకాశము లేని యీపట్టున స్వాస్థ్యము దుష్కరము. (విదూషకునితో) నీ వొంటరిగా నిచట నిలువం దగవు. నీయజమానుని మోసికొనిపోవ సహాయముగమ్ము.

చం—రండు పోదము. (శ్వేతకీర్తి దక్క తక్కినవారు నిష్క్రమించుచున్నారు.)

శ్వే—(స్వాగతము)

ఉ. మనకు న్నీరినవారి కాపదలు సంప్రాప్తంబు గాఁ జూచుచో
మనకష్టంబులు మాసిపోవు నొకనిం బాధించునార్తుల్ భువిం
గనుగొండ్రల్పులెఁ గానుపించు మఱి యాపీడల్ దగన్ లోకమం
దుఃఁ జెక్కుండ్రడు నొక్కమా టోదవినం దూలక్రియం దోఁచెడిన్.

"గృహచ్ఛిద్రాపలాయంతే మశకానాంతు కాగతిః" అన్నట్లు రాజంతవాఁడు పుత్రికల
స్త్రీశుశ్రూషవలన మన్నిగఁ బడినపుడు నావంటివాని క్రమముగా నయినను దండ్రి విధం
బెట్టి దండనమున కింతవగలం బొగలవలయునా? భైరవా నీవు దేశమంతయుం బ్రచ్ఛన్న
వేషమునం గ్రుమ్మరుచు నీపై నకారణముగా వచ్చిన యపవాద మాసి నీగురుయజమాను
లకుం బునర్విశ్వాసపాత్రుండవు గాఁ దగుతఱి వేచి నిజరూపంబున బయలు వెడలెదవుగాత.

రంగము—చంద్రసేనుని నగరు.

[వర్ధమానుఁడు, మంథర, చండిక, దోషాకరుఁడును బ్రవేశించుచున్నారు]

వ—ఈయుత్తరము గైకొని శ్వేతధ్వజుని చెంతకు సత్వరంబునం జని సర్వము నతనికి నివేదింపుము. మాళవబలములు మనరాష్ట్రమునకుం డిగినవి. అనుచరులారా! చంద్రసేనునింబట్టి తెండు. (కొందఱనుచరు లందుకయి నిష్క్రమించుచున్నారు.)

మం—తక్షణము వాని శిరచ్ఛేదము సేయింపుము.

చం—గ్రుడ్లు తోడించుము.

వ—అతని నాగ్రహమునకు విడువుఁడు. దోషాకరా! నీతండ్రికి మేము విధింపవలసినదండనము నీకనులం బడఁ దగినది కాదు. నీవు చండికతోడం జని శ్వేతధ్వజునితో యుద్ధసన్నద్ధుఁడవు గమ్మని విన్నవింపుము. నేను జాగుసేయక యట్లరయ్యెద. వారలు జాగరూకులయి యనుక్షణంబును మాయుభయులకు నుత్తరప్రత్యుత్తరంబులఁ గొనిపోవుచుందురుగాక. చండికా! పోయివత్తువుగాక. సర్వంబును భద్రంబగునీయెడ. దోషాకరా! పోయిరమ్ము.

[కుక్షింభరుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

రాజువార్త యేమైనం దెలిసివచ్చితివా?

కు—చంద్రసేనుఁ డాతనిభటసాహాయ్యమున నాతనిగుహక్షేత్రపుమార్గంబునం బుచ్చెను. అచ్చట వారినిమిత్త మొకరక్షకసైన్యము నిరీక్షించి యుండెనట. రాజు తోడం గొంత సామంతవర్గంబు కూడిచనియె.

వ—మీ రాణీగారికి గజ్జములనాయితంబు సేయఁబంపుము.

శం—పోయివచ్చెదను.

వ—శుభంబయ్యెడు పోయిరండు. (చండిక, దోషాకరుఁడు, కుక్షింభరు- నిష్క్రమించుచున్నారు.)

భటులారా! మీరుపోయి ప్రభుద్రోహి యగు చంద్రసేనునిబట్టి క కట్టెదుటం బెట్టుఁడు (శేషించినపరిచరులు నిష్క్రమించుచున్నారు.) యతనికి మరణదండన విధింప నధికారసామగ్రి మనయందు లేకున్నను; మున కెవఁడు ప్రతిఘటింపఁగలఁడు. ఎవ రీవచ్చువాఁడాద్రోహి? (ముప్వురుభ టులుఁ జంద్రసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

మం—అదుగో వాఁడే కృతఘ్నుఁడు.

వ—పెడకేలు గట్టుఁడీ యాదుర్మార్గుని.

చం—ఏమి మీయూహ మీరు నాయతిథు లన్నమాట పాటింపక యిట్టియా ను చితమునకుం గడంగవలదు.

వ—కట్టుఁడన్న నూరక దిక్కులేలఁ జూచెదరు? (భటులు కట్టుచున్నారు.)

మం—ద్రోహిని గట్టిగాఁ గట్టుఁడు.

చం—ద్రోహమును గృతఘ్నతయు నీయందున్నవిగాని నాయం దెంతమాత్ర మును లేవు.

వ—ఈపీఠమున వాని నంటఁగట్టుఁడు. దుర్జాతీ నీద్రోహము తెలిసినదిలే.

[మందర చంద్రసేనుని గడ్డము పీకుచున్నది.]

చం—అయ్యో దైవమా! ఏమీ యీపరిభవము గడ్డమునుబట్టి లాగుచున్నారు.

మం—గడ్డము నెఱిసినదిగాని ద్రోహము చావలేదు.

చం—పాపకర్మురాలా నీవు పెఱుకువెండ్రుకలే నిన్ను శపించుచున్నవి. గుడినుండి గుడిరాళ్లు దీయుకరణి అతిథులయి నాయిల్లు చేరి యిట్టియల్లరికి దొరకొంటిరే. ఏమి సేయుఁ దలఁచుచున్నారు.

వ—జోగాని మాళవునియొద్దనుండి నీకు వచ్చినయుత్తరములతాత్పర్య మేమి?

మం—అవె మా కిదివఱకే తెలిసినదిగాన నీవు కడవెట్టక కలదో పెఱింగింపుము.

వ—రహస్యప్రకారమున మనరాష్ట్రమునఁ బ్రవేశించియున్న మాళవసైన్యము లతో నీకుఁ గలసంబంధమును దాఁచక చెప్పుము.

మం—మతి చెడిన మీరాజును నీ వెవరిసంరక్షణకయి యంపితి? పలుకవేల? చెప్పుము.

చం—నాకుఁ గొంతసూచనగా నొకయుత్తరము వచ్చినదిగాని యది తత్పక్షమునుండి వచ్చినదిగాని ద్వేషులనుండి రాలేదు.

—శుద్ధమోసము.

—కేవలకల్పన.

—నీవు రాజు నెక్కడి కంపితివి.

చం—కురుక్షేత్రమునకు.

మం—ఎందులకయి కురుక్షేత్రమున కంపితివి. ఆజోక్యముపైఁ జిక్కొనిన నీ ప్రాణములు దక్కవని చెప్పలేదా?

వ—ఎందులకై కురుక్షేత్రమునకు? ముం దీప్రశ్న కుత్తర మిమ్ము.

చం—రోటిలోఁ దలయొగ్గి రోకటిపోటునకు వెరవనేల?

మం—ఎందులకై కురుక్షేత్రమునకు?

చం—నీక్రూరనఖములతని గ్రుడ్ల జీర కుండుటకును నీయక్కతనవాడికోరల నా మూర్ధాభిషిక్తునిమాంసమున నాటకుండుటకును నై యట్లొనర్చితిని. నిన్న నాపలిత శిరస్కునితలఁ బడినధారాపాతము సముద్రమును నింగికిం బొంగి చుక్కల మ్రింగునట్లు సేయఁజాలినను నతఁ డోరిమితో సైరించెను. అట్టిమహాప్రళయమునఁ దోట్లుడే వచ్చి నీ మోసలరోదనము సేసినను నీహృదయము కఱఁగి తలుపు దీయింతువే. మీకృతఘ్నత కర్హప్రాయశ్చిత్తము మీకు సంభవింపక పోదు. కన్నులారఁ జూచెదంగాక.

వ—అగే పాతకీ! కన్నులారఁ జూతువటరా? పీఠమును గట్టిగాఁ బట్టుకొనుఁడు. వీనికన్నుల నాకాల గ్రుమ్మెదను (ఒకకంటిం గాలఁగ్రుమ్ముచున్నాఁడు.)

చం—తలనెరయుదాక జీవింపఁ దలంచువాఁ డెవ్వండేని నాకుందోడయ్యెడుఁ గాక. దేవతలారా కావుఁడు. ఏల నాపై నిర్దయ చేసి యుపేక్షించెదరు.

మం—రెండవకన్ను వెక్కిరించుచున్నది. దానింగూడ బెరికివైచుము.

వ—మమ్ము శపింప సమకట్టితివా దురాత్మా!

మొదటిభట్టుఁడు—ప్రభువా! తాళుము. నేఁ జిన్ననాఁటనుండియు నీకొలువునం బెరిఁగినవాఁడ. నేఁడు నిన్నాగుమని నిరోధించుటకంటె నీకు హితతర మైనసేవ యెన్నఁడును జేసియుండ లేదు.

మం—ఛీ! పశువా!

మొదటిభటుఁడు—మగవాఁడవైతివేని దాడిబట్టి ఘూడింతును.

వ—ఛీ దుర్మార్గుఁడా! (ఇద్దఱును గత్తులు దూసి పోరుటకుఁ జొచ్చుచున్నారు.)

మొదటిభటుఁడు—నాకోపాగ్నికి శలభంబ వగుము.

మం—ఛీ దున్నకొనువాఁ డిట్లు తిరుగబాటు సేయునా! నీఖడ్గమిటు లిమ్ము (కత్తి నంది వెనుకనుండి వ్రేయుచున్నది.)

మొదటిభటుఁడు:—నాప్రాణములు పోవుచున్నవి గాని మహాప్రభూ! ఆమిగిలిన కంటితో నీతుచ్ఛుని యొంటిపై యూఁగంటుఁ జూచి సంతసింపుము (అని నేలఁ బడుచున్నాఁడు.)

వ—ఇంకనుం జూతువా ? (రెండవకన్ను గ్రుమ్ముచున్నాఁడు.) నీకళ యిప్పుడెటఁ బోయె?

చం—అకటకటా! నాకుం బ్రపంచ మస్తమించినది. దోషాకరా! నీకఁఠమునఁ బ్రాణముండ నా కీచేటు వాటిల్లినది. నీపాపపుమును జూపి దీనికిఁ దగిన నిష్కృతి యొనర్తువుగాక.

మం—ఛీ ద్రోహీ! దుష్టవర్తనా! నీపొడఁగాన నసహ్యపడువానికై యేల యిట్లు వాచెలిచెదవు. నీద్రోహమునకు వెక్కసపడి యాతఁడ దాని మాకు వెల్లడి చేసినవాఁడు.

చం—ఆహా! ఎంత యవివేకినై స్వీతకీర్తికి ద్రోహము చేసితిని. దైవములారా! నన్ను క్షమించి వానిని రక్షింపుఁడు.

మం—వీనిం గొంపోయి వీధిలోఁ బారవైచుఁడు. కురుక్షేత్రమునకు మార్గమును దడవుకొనుచుం బోయెడుఁగాక (ఒకభటుఁడు నిష్క్రమించును) హా ప్రాణనాయకా! నీ వట్లు గ్రుడ్డు తేలవై చెద వేల?

వ—నాకు గాయము తగిలినది. ఆగ్రుడ్డిని వెడలనడచి, యీతుచ్ఛునిఁ బెంటపాలు సేయించి నీవు నాతో రమ్ము. ప్రాణేశ్వరీ! గంటునుండిరక్త మెట్లు దొరిగెడినో కంటివే? అకాలమున నీగాయము తగిలినది. సాక్కు పుట్టెను. కేలూత యొసంగుము. (మందర కేలూతఁగొని వర్ధమానుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

రెండవభటుఁడు—నా కేగతి ప్రాప్తమైనను సరేకాని యాదుర్మార్గునికీమాత్ర మాయువు నిండవలెను.

మూఁడవభటుఁడు—ఆమెవార్ధకము వరకు బ్రదికి సహ్యమరణము సందునేని ప్రపంచమున నాఁడువాం డ్రందఱును బ్రష్టాత్మలు లగుదురు.

రెండవభటుఁడు—మనమూవృద్ధప్రభువును జేరి యతఁడు తనయిచ్చవచ్చిన తావు చేరుటకునై యేబిచ్చగానినైనఁ దోడు చూపుదము. పాప మాయంధుఁ డింక స్థిటమసలు నేని యీదుర్మార్గున కేమేమి తోఁచునో?

మూడవభటుఁడు—నేను నాస్రవించుకనులకుఁ గట్టుఁకట్టుఁగాను, కొంచెము దూదియుఁ గోడ్డిగ్రుడ్డుసానయుఁ దెచ్చెదను. దైవము రక్షించుఁగాత.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

శ్రీ

# మందపాల చరిత్రము.

## చతుర్థాంకము.

రంగము—బయలు.

[స్వేతకీర్తి ప్రవేశించుచున్నాఁడు.]

స్వే—చ. ధరణిఁ దరిద్రుఁగానిటుల త్యాజ్యుఁడనై చరియించుటాత్మలో
గరమును హేయతంబడి ముఖస్తుతులందుట కంటె మేలగున్
బరగ ఋణంబుసేసి కనువైభవమయ్యది వైభవంబె చూ
పరభ్రమియింపఁజేయునగు వాపునుబల్పుగ నేతలంపఁగన్.

చ. పరమదరిద్రుఁ డభ్యుదయ పాత్రతఁ గాంచెడుఁ గాని హీనతం
బొరయఁడు గానవానికిఁ బ్రమోదమెగల్గెడు లేదు ఖేద మీ
ధరపయి గోఁచిక్కిగులు దైన్యము నీతకు మించులోతు నెం
దరసినఁ గల్గునే తెలియకజ్ఞులు గానక కాకయెయ్యెడం
సిరిగలవానికిం గలుగు చింతయు భీతియు జోఁగి కుండునే?

కావున నాకు ధర్యమే కాని భయంబులేదు. ఎవరో వచ్చెడివారు.

[ఒక ముసలివాని చెయిపట్టికొని చంద్రసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కటకటా! ఈదైన్యమున నేతీరవాఁడు మాతండ్రి ప్రపంచమా! చక్రనేమిక్రమము ప్రాణులకిట్లు చ్ఛావదస్థితులు గల్గకుండినచోఁ బ్రాణములు కాలముతీరినను బొందిఁబాయనొల్లకుండుఁగదా? ముసలివాఁడు. మహాప్రభూ! నేనెనుబదివత్సరములనుండి నీతండ్రికి నీకును బాలికాఁడనై యుంటిని.

చం—సుహృదుఁడా! ననుఁబాసిచనుము. నీయుపచారములు నాకుశాంతినొసంగ నేరవు. నీకుహానిగావింపనోపు.

ముసలివాఁడు. అయ్యో! కానఁగన్నులు లేవు. నిన్నెట్లు విడుతు.

చం—కన్నులున్నపుడు మూసికొని తప్పదారిఁబట్టియుంటిని. అట్టినాకిఁక కన్నులుం డెన్నేల? అకటా! కలిమినఁ గన్నుగానక కడకు వేల్పొకనిన నేవిప్రయోజనమ్ము?

చ. ఎవనుదయావివేకములు హీనతనొందినవానిఁబొందు సం
పదలు ప్రభూతమోహమదవర్ధనహేతువులై కలంచు నా
పదలిలనంకుశంబులయి బల్మిఁ దదీయమదేభతుల్య దు
ర్మదయుతమానసంబును దెమల్చి తిరంబుగ నిగ్రహించెదన్.

ఓ ప్రియతనయా! స్వేతకీర్తి నిన్నెగ్గాడి త్రోచిపుచ్చితి. హా! పుత్రా! కంఠమున ప్రాణముండ నీగాత్రపరిష్వంగ సుఖంబు గనఁగల్గుదునేని నాకుం గన్నులు గల్గినట్లానందించువాఁడ.

ముసలి—ఎవరచ్చట?

స్వే—(స్వగతముగ) హా! దైవమా! మనుజుఁడెన్నటికిని సంసారసాగరమును సగాధముగడచి బ్రతికితిననుకొనఁగూడదు. ఇదివరలోని కష్టములకంటె కష్టతరావస్థ సంప్రాప్తమైనది.

ముసలి—ఇతఁడు పిచ్చిపాతల భైరవుఁడు.

స్వే—(స్వగతము) నేనింతకంటె నధోగతి పాలుగావచ్చును. భవిష్యత్తుంను నంతపటును "నాదురవస్థకిది చరమావధియని" నరుఁడెప్పుడును భ్రమంపఁజనదు.

చం—ఇతఁడు కేవలము పిచ్చివాఁడై యుండఁడు. అట్లేని, వీఁడు పిచ్చమున కేలఁ దిరుగును? నిన్నటిరేయి నేనిట్టివానినొకనిఁ గంటి. వాఁడు మనుష్యుఁడన్నం గృణప్రాయుఁడని తోఁచునట్లు చేసినాడు. నాపుత్త్రుఁడప్పుడు జ్ఞప్తికి వచ్చినాఁడుగాని వానియం దప్పటికి యనురాగము కుదిరియుండలేదు. లోగడ సమాచారముపలన సర్వమును దేటపడినది.

దేవతలకు మనమెంతవారము. పిల్లలీగలను జేసినట్టు వారు క్రీడార్థము మనలను బాములు పెట్టుదురు.

స్వే—(స్వగత) కట! కటా! ఇట్టి దురవస్థలోనున్నవానికిఁ గపటవినోదములు గల్పింపసమకట్టుట కటికివానిపని. (ప్రకాశముగా) జయజయ మహాప్రభూ!

చం—వీఁడే నా దిగంబరుఁడు.

ము—ఔను మహాప్రభూ!

చం—అయితే నీవు ప్రస్తుతము పోయి, నీహృదయమున పూర్వవిశ్వాసము మసలు

చుండెనేని మేము కురుక్షేత్రమార్గమున రెండుమూడుమైళ్లు సాగునప్పటి కీదీనునియూచ్ఛాదనార్థమొక యంగీ గైకొనివచ్చి యొసంగుము. వీనిం బ్రతిమాలి దారి దీయించుచుందును.

ముసలి—అయ్యో! వీఁడుపిచ్చివాఁడై.

చం—పిచ్చివాఁడు గ్రుడ్డివాండ్రకుఁ ద్రోవ చూపు కాలమువచ్చినది. నీవేమిచేయఁగలవు? నీకిష్టముండినచో నాకొకటి సెలవిమ్ము. ఏదెట్లైనను నీవునన్నుమాత్ర మవశ్యము వీడిచనుము.

ముసలి—నాకేమి కీడుమూఁడినను సరే నాయొద్దనుండు ప్రశస్తమైన యంగీ దెచ్చియిచ్చెదను.

(నిష్క్రమించుచున్నాడు)

చం—ఓసీ దిగంబరా!

స్వే—(స్వగతము) నాకుఁగాలుచేతులాడకున్నవి. ఇఁక నటించుట దుష్కరము.

చం—ఇటురమ్ము.

స్వే—(స్వగతము) తప్పకవచ్చినం జేయునదేమి? అయ్యో నీకడ్డులురక్తము గాయుచున్నవే?

చం—కురుక్షేత్రమార్గము దెలియుదే.

స్వే—అదినాకుఁగొట్టినపిండి, సందుగొందులు దిడ్డిదార్లు, కాలిత్రోవలు, రాచమార్గములు వేరెవ్వరికినివిలేవు. ఈ భైరవునైదు పెనుభూతములు బాధించుచు మతిచెడ్చినవి. నిన్నీశ్వరుఁడు రక్షించుఁగాత.

చం—ఈధనకోశము నందికొమ్ము దైన్యమున నీకుఁ దోడుగనున్నాడను. నన్నుఁ జూచిననీ ఖేదముకొంతయుడుగుఁగాత. సంపన్నాంఘులకు దారిద్ర్యమంజనము. కష్టములు వచ్చినప్పుడుగదా వారితరులకష్టములు భావమునఁదెలియనేర్చి, నిరర్థకములగు తమయర్థముల దీనార్తిపరిహారార్థమై పంచియివ్వఁ గలుగుదురు. అప్పుడుగదా ప్రపంచము సనర్థములు సార్థకములగును. కురుక్షేత్రమునకు దారి యెఱుంగుదువా?

స్వే—అయ్యా! ఎఱుంగుదును.

చం—అట్లయిన ననుందోడ్కొని యరుగుము.

చ. అరుణమగంగకూలమున నంబరుచుం బిశిరోగ్రభాగ వి
స్ఫురితపలాశకచ్ఛది సముజ్జ్వలి గండశిలావినీలమా
గిరివర మొందుగాంచెదవు. కేవనగాధజలస్రవంతి పై
కొరిగిభయావహంబగుచు నొప్పెడుదానినమున్న తాయుతిన్.

నన్నానగాగ్రమంబునకుం గొంపోయి నిల్పుదువేని హైమార్గము నేఁజూచికొని యెద. నీవునుఁదగుపారితోషికమునంది యభీష్టం జనియెదుగాక.

స్వే—సరేనీకేలిటులిమ్ము మార్గముదీసెద.

(నిష్క్రమించుచున్నాఁడు.)

---

రంగము—శ్వేతధ్వజునినగరువాకిట.

[చంద్రికయు, దోషాకరుఁడును బ్రవేశించుచున్నారు.]

చం—దోషాకరా! ఇదె మాభవనముం జేరితిమి. స్వాగతము. అదృష్టవశమున దురహంకారియగు నా భర్త మార్గమధ్యమున మనకుఁదారసించఁడాయె.

[కుక్షింభరుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మాప్రభువేడ ?

కు—లోపలనున్నాఁడుగాని యతనిముఖమెంతయు వికాసముఁబీడియున్నది.

ఉ. శత్రులువచ్చి చేరిరన సస్మితుఁడై గమపట్టనీవు నీ
 రాత్రికివత్తువన్నను గరంబును మోదుచ్చె మొగంబుదుష్ట చా
 రిత్రుఁడు చంద్రసేనుఁ డెదిరింగడు వంచనసేసిచేరఁ ద
 త్పుత్రుమద్రోహముస్వేడలఁ బుచ్చెనటన్నను గేలిసేసెడున్.

అతనికేమియొకాని యప్రియంబు ప్రియంబుగను బ్రియంబప్రియంబుగను గానఁపిం చెడును.

చం—(దోషాకరునితో) నీవిచ్చటనుండిపోరలము. అతనికైజమున నీపెత్తనము వలననే యతఁడీయువార సాహసములకును జొరనేరఁడు. క్షత్రధర్మమును విడనాడి తన్నొరులుపరిభవించినను విక్రమమునకుం గడంగఁడు. నీవువర్ధమానుని పాలికింబోయి, సేనలకూర్చి, సేనాముఖంబునరమ్ము. నేలోనికిఁబోయి యీగాజులు నాభర్త చేతులనిడి రణకంకణముగఁ బైచెను. విశ్వాసపాత్రుండగు నీకుక్షింభరుం డప్పటప్పట మున్ముదరాయ భారము నెరపుచుండెడిని. నీవు సాహసమునకుం దిగనోపుదువేని మనము మార్గమున నిశ్చయించుకొనినతలంపులీడేరియు చిరకాలములో నాహృదయము నీవశమొనరించుకొందవు గాక.

(ఉంగరమతనిప్రవేశించుచున్నది.)

దో—నాశక్తియుక్తులనెల్ల వినియోగించి యత్నించెదను.

చం—శుభంబగుఁగాత. (దోషాకరుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

క. పురుషులు పురుషులనంగనె
ధరఁగలవారెల్ల తథ్యతంబురుషులె యీ
తరుణీరమణుఁడు దోషా
కరుఁడొకఁడొ గాకదర్ప కప్రతిముఁడిలన్.

కు—అమ్మా! ప్రభువుగారు విచ్చేయుచున్నారు. (నిష్క్రమించుచున్నాడు.)

[శ్వేతధ్వజుఁడు ప్రవేశించుచున్నాడు.]

చం—కోటిమాటలకైనం దగనిదాననైతినా? ఇంతపాడితప్పనేల?

శ్వే—నీవునీమొగమున రాలురజోరేణువుపాటిసేయవు. నీవిపరీతస్వభావము దలంచిన నామేను గరుపారెడు.

కం. జనకునివిడనాడిన యా
ఘనపాతకి ప్రాణనుండిఖండించిన కో
ప్మను బోలి మ్లానమై చెడు
జనకద్రోహులనుముట్టి శ్వానము వెఱచున్.

చం—ఈనీతులు నాకుం జవికావు చాలింపుము.

శ్వే—ఆ॥ వె॥ జ్ఞానమజ్ఞునెదకు గంటకమైతోఁచు
రోగిపథ్యమన్న రోతపడును
పందిబురదమెచ్చుఁ బన్నీరు మెచ్చదు
ప్రకృతిఁబాయ్యలేరె పాపమతులు.

మీకునయమెట్లు ప్రియంబగు? మీరు ఘాతుకమృగములు గాని మనష్యప్రాయులరా? జనకుఁడుశతవృద్ధు అతని పలితోత్తమాంగముం జూచినబుద్ధియైన జాలిదలఁచు. అట్టివానిమీరు కృతఘ్నులై ద్రోహముచేసి మతివాయఁజేసితి రిట్టికృత్యంబులు గలవే. మీరు చేసినను జేసితిరి గాక. ఉత్తమక్షత్రియవంశజుడు తదనుగ్రహాదత్తరాజ్యప్రవర్ధమానవిభవుండగు వర్ధమానుండెట్లు మీపనికియ్యకొనియె. అకటా! ఈ యుత్కటకృత్యంబుల దైవంబుపేక్షించునేని మనుజులు మనుజులైనవి యిమ్మేదిని యాదోరాశిం గ్రుంకియైన రక్షకుందురే.

చం—సీ. తడబడిరాచబిడ్డనిగధాతనినుస్సృజియింపఁబోలు నీ
జడుపును దైన్యమన్ భీమయు క్షత్రకులంబునఁగల్గనేర్చునే
పుడమిచలింపమాళవచమూహతివీనుల సోకుచుండినం
బడయువుపౌరుషంబు జడుఁభఁగినిజేసె దుర్వ్యర్థచింతనల్

స్వే—కం. చండకృశానునిపోలిక
మండెడు కన్నులనుహృదయమర్మోద్భేదో
ద్దండములౌపల్కుల నో
చండ! రక్కసులునీకు సరిరారవనిన్.

చం—ఛీ! చేతఁగానివాఁడా!

స్వే—ఛీ! పిశాచీ! ఏలఁదుమ్మలలో ప్రొద్దుగ్రుంకినట్లు మొగము గర్వొక్కనబొమలు ముడివడఁజేసెదవు. ఎంతపిశాచివైనను స్త్రీవైతివిగాన సైరింపవలసె. కానిచో నీకండలు పెరికి భూతములకు భక్ష్యలు పెట్టి నాకోపాగ్ని చల్లార్చుకొందుఁగదా!

చం—ఏమిపౌరుషములు వల్కుచుంటివి?

[చారుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

స్వే—ఏమిసమాచారము?

చా—అయ్యా! వర్ధమానుఁడుసమసె. చంద్రసేనుని రెండవకన్ను గ్రుమ్మఁగమకింపనాతనిపై రోషముపట్టఁజాలక యొకభటుఁడు వానిం బరిమార్చె.

స్వే—చ. పటుగతినిట్టిలీవధిక పాపులకర్హములైనదండనల్
దటుకునఁబంపకున్నయెడ దైవమ! దుర్ణయమెట్లుమాయు ను
త్కటమగుపుణ్యపాపములఁ గల్గుఫలంబిటనేలభింప సం
ఘటనమొనర్చునీమహిమ కాదెజగత్స్థితి హేతువారయన్.

చా—అమ్మా! వెంటనే ప్రత్యుత్తరమున్నగోరి నీ చెలియాలియుత్తరమంపినది.

చం—ఒకవిధమున నా కీవార్త శుభశంసిగానె యున్నది. అధికారగౌరవము నాపై ప్రమ్రొగ్గెడును. కాని నా చెలియలు పతివిరహిత యగుటయు నాప్రియుఁ డగుదోషాకరుఁ డచట నునికియు నామానసం బలయించుచున్నది. నామనోరథములు స్వప్నసంపద లగునేమో యనుశంక నాకు హృదయశల్యముగా నున్నది. ఇంచుక విచారించి ప్రత్యుత్తర మొసంగెదఁ గాక [నిష్క్రమించుచున్నది.]

స్వే—చంద్రసేనునికన్నుల గ్రుమ్మినప్పుడు కొడు కెచట నుండెను?

చా—మీరాణితో నిచ్చటకే వచ్చినాఁడు.

స్వే—ఇచట గన్పడలేదె.

చం—లేదు మహాప్రభూ! తిరిగి నా కెదురుపడినాఁడు.

స్వే—ఈదుర్ణయము వాఁ డెఱుఁగునా?

చా—ఆమహాప్రభూ! వాఁడె వర్ధమానునికిఁ దండ్రిపై కొండెములు సెప్పిన వాఁడు. వర్ధమానుఁడు ధారాళముగాఁ బగ దీర్చుకొనుటకుగాను తాను మొగము దప్పిం [illegible]ఁడు.

స్వా—చంద్రసేనా! నే జీవించియుండ రాజునకు నీ వొనర్చినమేలు మరవను. మిత్రా! ఇటురమ్ము. ఇంకను గలవిశేషములు దెలుపుదువుగాక. (నిష్క్రమించుచున్నారు.)

---

## రంగము—కురుక్షేత్రమున మాళవశిబిరము.

[సుమిత్రుఁడును నొకపెద్దమనుష్యుఁడును బ్రవేశించుచున్నారు.]

సు—మాళవేశుఁ డంత యాకస్మికముగ మరలిచనినదాని కారణమెఱుంగుదువా?

పెద్ద—తాను బయలుదేరునప్పుడే తనరాజ్యకార్యములో నొకముఖ్యమైనదానివిషయము గొంత యుపేక్ష చేసి వచ్చెను. అది యిప్పుడు దేశోపద్రవకారియై యవశ్యసంస్కరణీయముగాఁ దోఁచినందున నాయన యాక్షణమె పోవలసివచ్చినది.

సు—అట్లైనవారికి సేనల కిక్కడ నాథుఁ డెవ్వఁడు?

పె—ఆయనసేనాని యగువిక్రమసింహుని సేనాముఖంబున నిల్పి చనియె.

సు—నీయుత్తరములఁ జదువుకొనునెడ సుశీలమొగమున ఖేదచిహ్నము లగపడినవా?

అయ్యో నాయెదుటనె చదువుకొన్నది. అప్పటప్పట స్థూలముక్తాఫలోపమంబు లగుబాష్పబిందువు లామె చెక్కుటద్దములపై జారుచుండినవిగాని యాధీరస్వాంతతవంతయంతయు దిగఁద్రావి గాంభీర్యము విడువదాయెను.

సు—ఇట్లయిన నావృత్తాంత మామెమనసును గొంత గలఁచినది.

పె—కాని బేలతనముగాని దురహంకారముగాని పొడమకుండినవి.

చ. క్షమయును ఖేదము న్హృదయసారసమందు జెనంగుచుఁడ నా
రమణిముఖాంబుజంబునను రమ్యవినూతనశోభ దోఁచె నా
సమయ మదెండవాన లొకచక్కి గనంబడు నాదినంబు చం
ద్రమున మనోహరంబయి ముదం బొదవుంచెను జూచువారికిన్.

చ. అరవిరిదమ్మిరేకులహిమాంబుకణంబులు గప్పమాడ్కి నా
తరుణివిలోచనంబు లసితద్యుతిఁ బొల్చెను బాష్పబిందువుల్

దరహాసితంబు తద్వదన తామరసంబునఁ దోఁచె మేఘమం
దరతరణిద్యుతిం దెగడి దంతమరీచులు కొంతబర్వఁగన్.

గీ. మంజుతన్మూర్తి గౌరవమార్దవములఁ
గ్రొంజవులు నించి యొప్పులు గుల్కు చలరి
ఖేవరనమును హృదయప్రమోద మొసఁగె
మధురమూర్తులకఖిలంబు మండనంబు.

సు—ఆమె నిన్నేమియుఁ బ్రశ్న లడుగలేదా ?

పె—ఒకటిరెండుసార్లు ససౌహార్దంబుగా నిన్నునుం దనతండ్రిని దలఁచినది. తన తోఁబుట్టువుల స్మరించి స్త్రీజాతి కెల్లఁ దలవంపు వాటిలఁ జేసితిరిగదా! రాత్రి బైట పెనుగాలివానలో నావృద్ధు నట్లు చేసితిరే. జగతిని విశ్వాసమును విశ్వసింపవచ్చునే? జాలి యెక్కడను నున్నదే? అనియామె చెక్కులఁ గన్నీరు గొనగొర జిమ్ముచు దుఃఖోపశాంతి సేయంగోరి యేకాంతనికేతనంబునకుం జనియె.

సు—ఆహా! మనప్రకృతులు పూర్వకర్మాయత్తంబులు గాకున్న నేకదంపతీజాతులగువీరల కింత నిసర్గసిద్ధ మగుభేద ముండునే? తర్వాత నామెతో మాట్లాడితివా

పె—లేదు.

సు—ఇదంతయు మాళవేశుని నిర్గమనమునకుఁ బూర్వమా?

పె—కాదు తన్నిర్గమనానంతరమె.

సు—పాపము వృద్ధరాజగు మందపాలుఁ డిచటనే యున్నాఁడు. మన వీటను వచ్చిన ప్రయోజన మతనికి మతి తెలిపి గల్గినపుడు గోచరింపనుగాని యాతఁడు తనకుమార్తె మొగము చూడ నొల్లకున్నాఁడు.

పె—ఏమికారణమున?

సు—నాఁ డామెను శాపపూర్వకముగ వారణలేక పరదేశముపాలు సేసి యామెభాగమునుగూడ నారాక్షసస్వభావుల కిచ్చినందున కొంతయు లజ్జావనతుఁడయి యామెకనులం బడ శంకించుచున్నాఁడు.

పె—అయ్యో! పాపము!

సు—వర్ధమానశ్వేతధ్వజుల సేనలఁగూర్చి నీ కేమైనఁ దెలియునా?

పె—ఆసేనలు కదలినవని తెలియవచ్చినది.

సు—అయ్యా నిన్ను మందపాలునివద్ద కాఁపు పెట్టి నేను కొండొకప్రయోజనం

బునకై కొంతకాలము ప్రచ్ఛన్నముగా నుండవలసియున్నది. అది తీరినవెనుక నీవు నన్ను దెలిసినపుడు నీ వీచేసినసాహాయ్యమునకుఁ జింతపడ నవసర ముండదు. నాతోడరమ్ము.

(నిష్క్రమించుచున్నారు.)

రంగము—అక్కడనె యొక్కగుడారమున.

[సుశీల, వైద్యుఁడు, భటులును దూర్యములతోఁ గేతనములతోఁ బ్రవేశించుచున్నారు.]

సు—మ. చలదుత్తుంగతరంగసంక్షుభితమా సంద్రంబువోలెం గడుఁ
జలచిత్తంబునఁ గంఠ మెత్తి ఘనగర్జాస్ఫూర్తి మ్రోయించుచున్
గలమక్షేత్రములందుఁ గం బెరుగు చెంగల్వల్లఁ బాంకూరముల్
గిలగిచ్చల్ దెలిదుమ్మిపూలును సిగన్ గీలించి యీ క్రేవలం
జెలరేగంబలు జాలిదూలి యతని స్నే నియ్యోడం గాంచితిన్.

అకటా! ఇంతలో నేమాయె సూర్యరభటులు వోయి నలుదిక్కులనుండు చేలఁ బోల్లు బీళ్లు నరసి యాతనిం గొనితెండు. (భటులతో నొకసేనాధిపతి నిష్క్రమించుచున్నాఁడు.)

ఈతనిమతి కుదుటఁబెట్టం గలుగుపుణ్యుఁ డెవఁడేని చేకూరునెడ వానికి నిలువెత్తుధనము వోసెదను.

వై—అమ్మా! ఆయునచిత్తచాంచల్యశాంతికి సుషుప్తియే పరమసాధనము శ్రాంతచిత్తమున కీవిశ్రాంతి యొసంగఁజాలు నోషధు లనేకములు గలవు.

సు—చ. ఇలగలనోషధీచయము లిందుకుఁ జాలనినాడునాదు చె
క్కులదిగజారి జాలుకొను కోష్ణజలంబుల నంకురించి యీ
స్థలమునఁ బుట్టుఁగాత నగదంకరణక్షమ నవ్యదివ్యసా
రలలితమూలికాతతి నిరామయుఁ డయ్యెడు మద్గురుండిలన్.

వెదకి తెండు. ఆలస్యము సేసిన మతిస్థిరత దక్కుటం జేసి ప్రాణాపాయంబయ్యెడు.

[చారుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చా—అమ్మా! శత్రుసేన యీమార్గముపట్టి యాసన్న మగుచున్నది.

సు—అది యిదివరలోఁ దెలిసినవృత్తాంతమే. మనసేనలు యుద్ధసన్నద్ధమై రిపుసేనం బ్రతీక్షించుచున్నయవి. తండ్రీ! భవదర్థమై యిదె చనుదెంచుచున్నదానను. నీవా

చం—నీవాఖ్య వైఖరి మారినట్లు తోఁచెడును.

స్వే—చ. గిరిశిఖరంబుఁ జేరితిమి క్రిందఁ గనుంగొనఁ గండ్లుగిఱ్ఱునం
దిరిగెడునంత రాళమున నెమ్మిఁ జరించెడు గృధ్రవాయసో
త్కరమతి సూక్ష్మరూపమునఁ గన్పడుఁ బిచ్చుకగుంపువోలె నా
దరిగిరిపార్శ్వమందునను ధాతుశిలాబితికై యొకండు చూ
పరకు భయంబుగొల్పుచును పట్టొకయింతయు లేక నిల్చెడుం
బరిసరవాహినీతటిని బ్రాకెడు మూషకపంక్తివోలె జా
లరులు చరింత్రు రల్లదె జలంబులఁ దేలెడు నోడ చిన్నక
ప్పెరవలెఁ గానుపించెడును భీతిఁ జలించెడు మేనునిల్చినన్.

చం—నీ వున్న తావున నన్ను నిల్పుము.

స్వే—నీచేయిటులిమ్ము. ఇప్పుడు కొనయంచున కడుగుదూరమున నుంటివి. నా యొత్తు ధనమువోసినను నేనిట్టి సాహసమున కియ్యకొనను.

చం—ఇఁక నా చేయివిడిచి యమూల్య రత్నగర్జితమైన యీ ధనకోశమును గైకొనిపొమ్ము. నిన్ను సహాయమునకై దైవము మెచ్చుఁగాత! నీపోకనాకు వినఁబడునట్లు పొమ్ము.

స్వే—దయయుంచుము. పోయివచ్చెద.

చం—నీయెడ నాకు హృదయపూర్వక మగువాత్సల్యముగలదు.

స్వే—(స్వగతము) ఈ వంచనచే నీతని దుశ్చింత మాయుఁగాత.

చం—(కేలుమోడ్చి.)

ఉ. చింతల నెంతయుం జివికిఁ జేడ్పడియైహికభోగమన్న న
త్యంతవిరక్తిగల్గి నిరతంబు భవచ్చరణాబ్జయుక్తిమై
నెంతయు ధన్యతంబడయ నిచ్ఛజనించిన మేనువాయ నం
కింతుఁ గృపన్న నుంబహుళ కిల్బిషమగ్నుని బ్రోవుమీశ్వరా!

గీ. తనువు క్రిందఁబడినదాఁక తాళుదు నేని
పూర్వకర్మమెల్లఁ బొలియుఁగాని
బొందిదొరిగినిన్ను బొందఁగోరికగల్గె
నిలువనోపఁదింక నిముసమైన.

దైవమా! స్వేతకీర్తి సప్రాణుఁడైయున్నచో వాని నాయు రారోగ్యైశ్వర్య యుతుం జేయుము. ఓసీ. నీవిఁక తొలఁగి చనుము. (ముందుకుఁబడుచున్నాడు.)

స్వే—అయ్యో! పడితివా (స్వగతముగా) తానను కొన్న త్రావుననే యుండినచో నీతం డీవరకు నా మాపశిష్టుండై యుండును. ఇప్పుడైనను నాకునప్పు గనం జనదు. స్పష్ట మైన ప్రాణత్యాగనిశ్చయ మొకానొకప్పుడు ప్రాణహాని యొనర్పంజాలదు. (ప్రకాశ ముగా.) అయ్యో యెంతపని జరిగినది. నాయనా పలుకుము. నా మాట వినంబడుచున్న దా? ఇంకెక్కడి వినంబడుట? ఆహా! ఏమి యీ ఆశ్చర్యము. ఇంకను సప్రాణుండవై యుంటివే?

చం—నన్ను విడువుము. నాకీబ్రదుకన్న భారముగా నున్నది.

స్వే—ఊ. తూలమువోలె నీవిటులం దుంగనగాగ్రము నుండి నేలపై
గూలియు నొవ్వకున్కగను గొన్నను విస్మయమయ్యెడుం గదా
గాలము చెల్లకుండిన జగంబునం బ్రాణులు చిచ్చుచొచ్చినన్
నేల నడంగియుండినను నీటమునింగినం జావ నేర్తురే.

చం—నేను పడితినా? లేదా?

స్వే—సామాన్యపుం బాటుపడితివా? ఆకొండకొనం జూడుము. మేఘమండలము నొరయుచున్నదే?

చం—అయ్యో నాకుం జూడంగను లెక్కడివి? అకటా! దుఃఖిములకుం బొందుటకునై మరణమైనను నాస్వాధీనము గాదాయెగా. ఇంతవరకు దీనులుర్థతుల యాగ్రహముననుం దొలంగుట కీపాటి స్వాధీనమగు సాధనమొకటి యున్నదను నమ్మకమునం గొంత యూరట గాంచితి. అదియును నేటితోం దీరె. ఇంక నాకెద్ది తెరవు. ఎందుం జొత్తు.

స్వే—నా కేలూతగొని లెమ్ము. లేవం గల్గితివా?

చం—అకటా! అనాయాసముగా లేచి నిల్చితిని.

స్వే—ఇంకొక యద్భుతము. ఆ పర్వతాగ్రమున నిన్న విడిచి పోయినదేమి?

చం—పాపమొక నిరుపేద బిచ్చగాడు.

స్వే—ఈక్రింద నిల్చిన నాం కడియొక వికృతాకారమగు భూతముగాం గన్పట్టినది. కనుంగవ తీక్ష్ణమై దీప్తార్కద్వయము ననుకరించియుండె. సహస్ర జిహ్వలు ననేక నాలుకలు కుటిలములై కొనలు దేరు కొమ్ములును జూపరకెంతయు భయంబు గొల్పచుండె. నాయనా! అఘటనాఘటన సమర్థుండగు దైవము కరుణ కల్గి జీవించితివి. నీవింక నొండు తలంపులు దక్కి నాతోడరమ్ము.

చం—ఔనౌను! నాకిప్పుడు దెలియుచున్నది. నే మనుష్యుఁడని భ్రమిసితి గాని నన్ను జే పట్టిన యీ భూతము మాటిమాటికిఁ బిశాచముల సంగతే వాక్రుచుం డెను. ఇఁక నా దుశ్చింతలు దొలఁగి దైవానుగ్రహము నిరీక్షించెదఁ గాక.

స్వే—అవశ్య మటులౌనర్పుము. ఈ వచ్చువారెవరు? (అడవి పువ్వుల వికారముగా శరీరమం డడనెడ ధరించి మందపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

చూడ మతిలేనివాఁడుగాఁ గన్పట్టుచున్నాడు. ఉన్నచో నిట్టి వికారముండునా?

మం—నే రాజును నాణెముల ముద్రించినందుకు నన్ననఁగల వారెవరు?

స్వే—అయ్యో! నిన్నుజూడ గుండె నీరగుచున్నది.

మం—ఆ యేబ్రాసి, పంట కాపువలె విల్లెక్కుడు చున్నాడో కంటివా? ఓరి యేబ్రాసీ. ఆ శ్రవణాంతము చేయుము. ఏమిరా యీచుంచు నిర్భయముగాఁ దిరుగుచున్నది. సొమ్ము గావలసియుంటే నీలెక్క తీసుకొనిరా యిచ్చి వేసెదను.

చం—ఆకంఠస్వరము నాకుఁ బరిచితమైనదే. ఆయన మందపాల మహారాజు గాడా?

మం—నేను కాలిగోరు మొదలుకొని సిగ పువ్వువఱకును బ్రభువునే. నే కన్నెఱ్ఱజేసిన జగమెట్లు వడఁకునో చూడు.

ఓహో! చండికా నీగడ్డము నెరసినదేల? ఛీ తుచ్ఛులు. కుక్కలవలె నేమినైచ్యములు సేసిరి, ఏమి యిచ్చకములుపల్కిరి. నేచెప్పిన దానికెల్లఁ దలయూచిరే. వానతలం దడిపినపుడు, గాలి మేను వడకించినప్పుడును, పిడుగులు నామాటవినక పడినప్పడును వాండ్రగుట్టు నాకు స్పష్టమైనది.

చం—ఏవీ! నీపాదములు సోకనిమ్ము.

మం—మనుష్య వాసన గొట్టుచున్నది. తుడువనిమ్ము.

చం—మహాప్రభూ! నీ కెట్టిగతి పట్టినది? నన్ను గుర్తించఁ గలవా?

నీకండ్లు నాకు బాగుగా గుర్తు తెలియును. నన్ను వెక్కిరించుచుంటివా? ఈశపథమును జదువుము.

చం—ఇందలి ప్రతియక్కరము నర్కసదృశం బైనను నాకన్నులకుం గోచరంబు కాదు.

మం—ఓహో! నీవా? కంటిలో గ్రుడ్డును, సంచిలో దుడ్డును లేనిదశపట్టినదా? నీకుఁ బ్రపంచస్థితి యిప్పుడు గన్పడుచున్నదా?

చం—నా జ్ఞాననేత్రమునకుఁ బ్రపంచమిప్పుడు స్పష్టముగా గోచరించుచున్నది.

మం—ఆ. వె. చినుగువలువదాల్చు మనుజానితప్పలు
కొంచెమైనఁదోచు గొప్పలగుచు
సరిగపట్టువల్వ ధరియించువారల
సకలదుర్ణయములు సమసిపోవు.

ఆ. వె. ప్రభువు లెంతలేసి పాతకంబు లొనర్ప
ధర్మనిగ్రహమునఁ దగుల రెందు
పేరు లేనివాని నేరముల్ గనుఁగొన
నూరి గ్రుచ్చులెల్ల శూరు లరయ

ఇందెవరును దప్పు చేయలేదు. ఎవ్వరిని దూషింపను. ముఖ్యాన సులోచనముల జోడు దగిలించుకొని నీటుజూపు నవనాగరికులవలె సర్వజ్ఞత్వ మభినయించుచున్నావు. ఎవఁడురా. నాకాలి జోడూడ్చుము.

స్వే—ఆహా! ఏమీ తెలిసియు మఱపును. ఈయున్మాదవివేకసమ్మేళన మేమిచిత్రముగా నున్నది?

మం—నిన్ను మఱువలేదు. చంద్రసేనుఁడవుగాదా? నాదైన్యమునకు నీకు విచారము వొడముచున్నయెడ నాకన్నవ నీ కెరు విచ్చెదను. నీకుం గొంతయూరట గల్గఁజేసెదఁగాక. మన మీప్రపంచమున జననమందునపు డేడ్చుటకుం గతంబేమో నీకుఁ దెలియునా? తెలియనిచోఁ జెప్పెద వినుము.

చం—అయ్యో! దైవమా! ఈసంసారకూపమునఁ బడవలసెఁగా యని. నాకాకూతుంగ్రుని, అల్లుండ్రును నిప్పుడు చేజిక్కినం గసిమసంగ కుందునా?

[ఒకరాజపురుషుఁడును, అనుచరులును బ్రవేశించుచున్నారు.]

రా— ఇదె ప్రభువు. పట్టుడు మహాప్రభూ మీప్రియపుత్రిక—

మం—ఏమి! బందిగ్రాహము ప్రాప్తమయ్యెనా? విముక్తిలేదా? ఇంతయు దైవనిర్ణయము. నన్నుమాత్రము బాగుగ నాదరించిన మీకుం బారితోషిక మొసంగెద నాకు మతిభ్రంశ మగుచున్నది. మంచివైజ్జులను నెమకితెండు.

మహాప్రభూ! మీకేమిటం గొదువ యుండదు. విచ్చేయుఁడు.

మం—నేను పెండ్లికొడుకువలె యమపురికి బయలుదేరవలె. నేను మహారాజు నన్నమాట మఱచిపోయినారా?

రా—చిత్తము మహాప్రభూ! యేమియాజ్ఞ.

మం—ఏదీ నాపసుగు పట్టఁగలరా ?

(ముందు రాజును వెంట నను చరులును బరుగిడుచున్నారు.)

చం—ఎంతయల్పునియం దైనను నీదైన్యముం గన్నఁ గన్నుల నీరు గమ్మకుండును. హా ! మహారాజా యెట్టియవస్థపట్టినది ? నీయిరువురు కుమార్తెలును దెచ్చిపెట్టిన యీదు రవస్థ నీమూడవకుమార్తె పరిహరించుగాత!

స్వే—అయ్యా వందనము.

రా—శుభమస్తు ఏమికావలెను?

స్వే—యుద్ధముసంగతి మీరేమైన వింటిరా ?

రా—ఆసంగతి మెడమైన తలయున్నవాని కెల్ల వీశేచమే. నీకుఁ దెలియకు న్నదా ?

స్వే—శత్రుసేన యెంతదవ్వులనున్నది ?

రా—సన్నిహితమైనది. అనుక్షణమును బ్రతీక్షించుచున్నారు. సుశీలా మహా రాణిగారిచటఁ బరిమీఁద నున్నదేకాని యామెసేన శత్రుసేన కభిముఖమై నడచుచు న్నది.

స్వే—నేఁ గోరినయంశ మిదియ. ఇఁక నే బనివినియెద. (రాజపురుషుఁడు నిష్క్రమించుచున్నాఁడు.

చం—దైవమా ! నాకు శీఘ్రమున విముక్తి దయచేయుము. భవదాదిష్టాయుః పరిమాణము సరియగువఱకును నా కొందుదుశ్చింత్ల గల్గకుండఁ బ్రసాదింపుము.

స్వే—నాయనా ! ఈ మీప్రార్థన యెంతయు యోగ్యముగానున్నది.

చం—అప్పా నీ వెవరవు.

స్వే—కష్టములు శల్యాశల్యమునను నాటి దైన్యమన్న జాలిగలుగు హృదయము గల్గినయొక పేదసంసారిని. నీచే యిటులిమ్ము. నిన్నొక యిరవుచేర్చి పోయెద.

చం—ఈశ్వరుఁడు నిన్ననుగ్రహించుఁగాత.

(కుక్షింభరుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కు—ఓరీ దొరికితివి. నీ నేత్రశూన్యమైన యీశిరము నాభాగ్యము నింపుటకు నిర్మింప బడినది. దేవులిం దలఁచుకొనుము కత్తి కంఠమునఁ బడుచున్నది.

చం—మిత్రమా ! నన్ను రక్షించెదవు. ఒక్క వేటునం దునుముము.

(స్వే॥ అడ్డము సొచ్చుచున్నాఁడు.)

కు—ఓరీ! దుష్టుఁడా నీవీసాహసమున కేలఁ జొచ్చితివి. ప్రభు[illegible] ల్ప నీతరమగునా? చేయి విడువవేని వానియవస్థలో నీవును భాగస్వామి వగుదువు.

స్వే—బాబు! ఈ బీరాలు గట్టి పెట్టుము.

కు—విడువుము విడువకున్న నీప్రాణములు విడువవలసి వచ్చును.

స్వే—మాయూపున కేల? ఈమాటలు గట్టిపెట్టి నీత్రోవ జూచుకో. [illegible] చప్పుళ్లకుఁ గుండెల్లు బెదురునా? అదిగో దరికి రావద్దంటె వచ్చుచున్నావు. అయితే యేదిగట్టిదో నాదుడ్డుకఱ్ఱయో నీతలయో చూతము.

కు—పోరా పక్షీ.

స్వే—నీ కోతలు గట్టిపెట్టు. పండ్లురాల్చెదను. (పోట్లాడి స్వేచ్ఛ [illegible] బడగొట్టుచున్నాఁడు.)

కు—ఓరీ దురాత్మా చంపితివి. ఈసంచి గైకొని నా [illegible] మొనర్చి నా యంగీలోని యుత్తరముల నా పూర్వికులతో వచ్చు [illegible] డగు దోషాకరున కందఁజేయుము. హా! అకాలమృత్యువా! (అని చచ్చుచున్నాఁడు.)

చం—అయ్యో! చచ్చినాఁడా!

స్వే—నాయనా నీవు కూర్చుండి విశ్రమించుము. వాఁడు చెప్పిన యుత్తరములు నా కుపకార కారకములు గావచ్చును. వాఁడు మడిసినాఁడుగాని వానిచావు మఱియొకని చేతనైన తృప్తిగనుండెను. లాభ్య బంధములారా! సడలుడు మర్యాదోల్లంఘన [illegible] మన్నింపఁబడుఁగాత. శత్రురహస్యగ్రహణమునకు వాంఛనీయములగు [illegible] క్షత్రియుల కుత్తరములు విప్పు టొంతపని (విప్పి చదువుచున్నాఁడు.)

మనము పరస్పరము చేసికొనిన ప్రమాణములు మఱువవలదు. అతని [illegible] నీ కవకాశములు మెండుకొని యుండును. నీకిష్టముండిన నుచితమగు స్థలమును గాలమును దొరకక పోవు. ఆతనుజయము గైకొని నిరపాయముగా నిల్లుచేరువాఁడేని మనము చేయున దేమియు లేదు. అతని శయనాగారమునఁ గారాగారవాసము నాకుండఁదప్పదు. కావునఁ గరుణించి నాకా చెఱదీర్చి నీ యధీనమొనర్చి కొనుము.

నీ ప్రియపత్ని యనిపించఁగు,

భవదిష్టసఖి

“చంద్రిక”

ఆహా! స్త్రీసాహసమునకు మేర లేదుగదా! పురుషవరేణ్యుఁడగు తన భర్త ప్రాణములు దీసి నాత్మను నైకొననెట్టి మోసము సాగుచున్నది ఈ విశ్వాసఘాతుకులకు రాయభారివగు నీకీ యుసుకలోఁ బూడఁద్రొక్కి యెంతయు నర్హ సంస్కారము. నేనీయశనిజ్వాలోపమగు నీయుత్తరమును స్వైతధ్వజుని కండ్లయెదుటఁ బెట్టెదను. నేనిన్ను జంపి నీదుర్దౌత్యమును గనుగొనఁగల్గితెల్ల నాతని కాయుశ్శేష ముండుటవలనఁగదా!

చం—రాజుమతి చలించినది. నా దురదృష్టమేమోగాని నామతి రాయివలె నిశ్చలముగా నుండి యీ దురవస్థలన్నియు సమగ్రముగా గ్రహించుచున్నయది.

అ. వె. మనసు కారణంబు మఱిబంధమునకు మో
క్షమునకిట్టి దుఃఖ సమయములను
మఱపుఁ బొడివివిమల మతిసంచలించిన
సౌఖ్యమంతకంటె జనులకగునె.

(దూరమున రణదుందుభిధ్వానము వినవచ్చుచున్నది)

స్వై—అల్లదె యనతిదూరంబున రణదుందుభి మ్రోయుచున్నది. నిన్నొక మిత్రుని సంరక్షణలో నుంచి నేఁ బోవలసియున్నది.

(నిష్క్రమించుచున్నాఁడు.)

రంగము—మాళవశిబిరమునం దొకగుడారము.

మాళవపాలుఁడు తల్పగతుఁడై నిద్రించుచుండ హృద్యగీతములు మందమధురములై కర్ణరసాయనములుగ సాగుచున్నవి రాజపురుషుఁడును, అనుచరులును, బరివేష్టించి యున్నారు. సుశీలయు, సుమిత్రుఁడును వైద్యుఁడును బ్రవేశించుచున్నారు.]

సుశీ—సుమిత్రుఁడా! ఆపద్బాంధవుఁడవగు నీ ఋణము నే నెన్ని జన్మములకైనం దీర్చుకొనఁగల్గుదునా?

సుమి—అమ్మా నాపై నీకుఁగల యీ నెనరువలనను సహృదయాంతఃకరణమువలన నేబదిరెట్లు తీర్చివైచితివి. ఇంక కొదువేమి? నేఁజెప్పిన యంశములన్నియు యథార్థము వీసమెక్కుతక్కువలు లేవు.

సుశీల—పూర్వదురవస్థాజ్ఞాపకము లగు నీజీర్ణవసనము విడిచి యర్హవస్త్రములు ధరింపుము.

సుమి—అమ్మా క్షమింపుము. నే నింక నజ్ఞాతస్థితి నుండినఁగాని [illegible] లకుఁ గలిపెడు కార్యంబులకు భంగంబు పొసఁగుఁగావున నాకు సప్తశతీ [illegible] తేపమున నా యథార్థస్థితి నీకును గోచరముగానియట్లుంపనిమ్మని నిన్ను [illegible] ననుగ్రహింపుము.

సుశీ—అట్లయినసరే. అట్లు కానిమ్ము. (వైద్యునితో) ప్రభువు—[illegible]?

వై—ఇంకను నిద్రించుచున్నారు.

సుశీ—క. తనయుల దుర్ణయవర్తన
మానఁ దంత్రులు నడలుఁ బీణపొలుపున మణిమా
యైన యీనృపపుంగవు స్వ
స్థునిఁ జేయుత దైవ మఖిల శుభకరుఁడు దయన్.

వై—అమ్మా పూర్ణసుషుప్తి గలిగినది. ఇఁక మేలుకొలుపుదమా?

సుశీ—శాస్త్రమును అనుభవమును అనుసరించి మీరుఁ [illegible] రింపుఁడు. ఆయనగాత్రమున వస్త్రమాల్యాదులఁ బొందుపరచినారా?

రా. పు—అమ్మా! ఆయన గాఢనిద్రాసక్తుఁడయి యుండ నాపని [illegible].

వై—మేలుకొల్పుదము. అమ్మా! నీ వీదాపున నిల్వుము. [illegible] కలక దేరుటకు సందియము లేదు.

సుశీ—మంచిది. కానిండు.

వై—అమ్మా! నీ విప్రక్కకు రమ్ము. సంగీతము కొంచెము పాడింపుమా [illegible] పుఁడు.

సుశీ—క. ఆపలువలు చిలువలక్రియ
నీపగిదిం జేసినట్టిహృదయవ్రణముల్
రూపఱ సిద్ధౌషధములు
నాప్రాణం బొడముగాత నాభాగ్యమునన్.

(అనుచు హస్తమునఁ దండ్రిమేని నిమురుచున్నది.)

సుమిత్రుఁడు—ఓ సదయహృదయా!

సుశీ—కర్కశహృదయులారా! ఎంత చేసితిరి! ఆరేయి జలప్రళయమున మీ వాకిట ఘాతుకమృగము లుండి మొఱపెట్టినను వాని మొఱ యాలకింపక పోవచ్చునా? తండ్రీ! అట్టియలజడిబడి నీసుకుమారప్రాణము లెట్లు నిల్వఁజాలె? కటకటా!

సీ. సకలనీతిప్రౌఢి సరిలేక మించినమతి యదియా యిది మాన్యచరిత
అఖిలరాజన్యమాన్యపదాబ్జునకుఁ గట్టఁ దగుపట్టులా యివి ధైర్యరాశి
చటులఝంఝానిలఝంపాప్రద్వ్యాప్తి బడు మౌళియా యిది భవ్యతేజ
జంబుకసూకరసర్పాదిసాహచర్యార్హ మేతను విది యమలచరిత
ఎంత శ్రీమంతునకు విధి యెంత వ్రాసె
కలిమి యొకచోట నిలకడ గాంచు టదిది
ప్రాణ ముండఁగఁ గడతేరి బ్రదికితిమన
రాదుబో యేరికైన ధరాతలమున.

అదే మెదలుచున్నాఁడు పలుకరింపుఁడు.

వై—అమ్మా! నీవు పల్కరించు టెంతయు నుచితము.

సుశీ—ప్రభుశేఖరా! సుఖమా నీకు?

మం—నన్ను సమాధినుండి మేలుకొల్పి నీ వెంతపాపము గట్టికొంటివి. నీవు ధన్యవు. నాపాపమున నేను నారకాగ్నిం బడియుంటి. యాత్రవు లెట్లుండును చున్నవో చూడుము.

సుశీ—అయ్యో! నన్నెఱుంగుదురా?

మం—ఎఱుంగుదును. నీవు పిశాచమవు. నీ వెప్పుడు మృతినొందితివి?

సుశీ—అకటకటా! ఎంత పెడత్రోవనున్నాఁడు!

వై—అమ్మా! మెలఁకువ పూర్ణముగా గల్గలేదు. ఇంచుక తాళుము.

మం—ఎక్కడనుంటిని? ఎక్కడఁ జేరితిని? ఇది పగలా రాత్రియా? నన్నదట్టమయిన భ్రమ గ్రమ్ముచున్నది. శత్రువునకయిన నిట్టియవస్థ రానొల్లను. నేనేమి పలుకుచుంటిని? ఇవి నా చేతులేనా? సూది గ్రుచ్చిన నొచ్చునేమో చూతము. దైవమా! నాయవస్థఁ దెలియు నుపాయముం బ్రసాదింపుము.

సుశీ—అయ్యా నన్ను కటాక్షములతో వీక్షించి యాశీర్వచన మొసంగుము. అయ్యో! నీవిట్లు ప్రణతుడవు గాఁదగువా? వలదువలదు.

మం—నన్ను బరిహాస మొనర్పకుము. నేను మతిపోయిన శతవృద్ధుడను. మిమ్మెఱుంగునట్లు దోచుచున్నదిగాని నామతి కడుసంశయాత్మకముగ నున్నది. ఎంతయోచించిన నేగట్టిన యీపుట్టములు నా కెట్టుజొచ్చినవో జ్ఞప్తికిరాకున్నది. నిన్ను నెక్కడ నుంటిని! నేడున్న దెచట? నాకుం బోలినట్లు చెప్పెద నవ్వబోకుము. నీవు మాసుశీలవు గావా?

సుశీ—ఔ నౌను తండ్రీ.

మం—ఏదీ మాతము నీబాష్పములు తడిగా నున్నవా? నీవు విషమిచ్చినను ద్రాగుటకు సిద్ధముగా నున్నాడను. నీకు నాయెడ ప్రేమమడి లేదని నేనెఱుంగుదును. నీతోబుట్టువులు గడుగృతఘ్నులయి నా కపకృతి యొనర్చిరి. అట్టినడవడికి నీకైనం గొంతగారణ మున్నదిగాని వారి కిసుమంతయును లేదు.

సుశీ—నాకుఁగూడ నేమియును లేదు తండ్రీ!

మం—ఏమి! నే నిపు డున్నది మాళవదేశమా?

సుమి—అయ్యా! కాదు నీరాష్ట్రమున నే యున్నాఁడవు.

మం—నన్ను వంచింపకుఁడు.

వై—అమ్మా! నీ విఁక హృదయస్వాస్థ్యము గల్గియుండుము. చూచితివా పూర్వ రౌద్రావేశ మెట్లడగిపోయినదో. కాని వెనుకటి విషయములు జ్ఞప్తికి దెచ్చి కలతవ రచు టిప్పు డెంతయు ననుచితము. పూర్ణస్వస్థత చేకూఱువరకు నాయనను విశ్రమింప నిండు.

సుశీల—అయ్యా! దయచేసి కొంచె మిట్లు మెల్లఁగా సాగిరాఁగలరా?

మం—నేను పెద్దవాఁడను. మతిలేనివాఁడను. నాచెయ్యలను మఱచి మన్నింపుఁడు. (సుమిత్రుఁడు రాజపురుషుఁడును దక్క తక్కినవారు నిష్క్రమించుచున్నారు.)

రాజపురుషుడు—వర్ధమానుఁ డట్లు వధింపఁబడినది నిజమేనా?

సు—సంశయ మేల?

రా—ఇప్పు డాయన సేనలకు నాథుఁ డెవడు?

సు—చంద్రసేనుని దాసీపుత్రుఁ డని వదంతి?

రా—శ్వేతకీర్తి సుమిత్రునితో గాంధారదేశమున నున్న ట్లోకప్రవాద మున్నది.

సు—ప్రవాదము బహుముఖములుగా వినవచ్చెడు. సేనలు సమీపించుచున్నవి. ఇంక తడయంజనదు.

రా—సమరము ఘోరభంగిని సాగుచన్నది. నీకు భద్రమా గాత.

(నిష్క్రమించుచున్నాఁడు.)

సు—నాయుద్యమములకు నేఁటియుద్ధము ఫలోదయకాలము సఫలమగునో విఫలమగునో.

(నిష్క్రమించుచున్నాఁడు.)

శ్రీ

# మందపాల చరిత్రము

## పంచమాంకము.

రంగము—కురుక్షేత్రసమీపమున భారతశిబిరము.

[దోషాకరుఁడు, మందర, పెద్దమనుష్యుఁ డొకఁడు, భటులును శ్వేత ధ్వజపటములతోఁ బ్రవేశించుచున్నారు]

దో—శ్వేతధ్వజుని నిశ్చయము నిలవఁబడియున్నదో లేదో కనుఁగొనరమ్ము. ఆతని చిత్తముస్థిరముకాదు. అతి సంశయాత్ముఁడై నిముసమున కొకవిధాలోచన సేయుచుండును. పర్యవసానముఁ దెలిసిరమ్ము. (పెద్దమనుష్యుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

మం—చండిక సేవకునిపని దీఱినట్లున్నది.

దో—నాకును అదే సందేహము.

మం—ప్రియమిత్రమా! నీకు నేనొనర్పంబోవు నుపకారమును గుర్తెఱుంగుదువు గదా. నే నొకప్రశ్నం బడిగెదను. ఉత్తర మున్నది యున్నట్లు చెప్ప వేఁడెదను. నాతోఁబుట్టువుపై నీ కాదరము లేదా?

దో—గౌరవపూర్వకముగా నాదర మేకాని వేఱొండులేదు.

మం—ఆపెతో పరిచయము చాలింపుము. అది నాకు హృద్యముగాదని మొన ర్చెడిని.

దో—నీ కావంత యావంతయు వలదు. అదె నీసోదరియు భర్తయు

[శ్వేతధ్వజుఁడు, చండిక, భటులును సూర్యధ్వజపటములతోఁ బ్రవేశించుచున్నారు.]

చం—(స్వగతము) యుద్ధమున నపజయమయినను హైతుగాని నాతోఁబుట్టువు నన్నాతనికిం జూపనోప.

శ్వే—రాజు తనప్రియతనూజం జేరెనఁట. మనయాధర్మపరిపాలనాపరిభూతమగు ప్రకృతివర్గము కొంత మనలఁ దిగనాడి వారిం జేరె నని తెలియవచ్చుచున్నది. నా

శౌర్య మధర్మపక్షమున నెన్నండును బ్రజ్వలింపదు. కాని మాళవసైన్యములు మనరాష్ట్ర మాక్రమించుచుండె నని విన్నంతనే పౌరుషము కొంత వొడమచున్నది.

దో.—నీపలుకు లెంత యౌదార్యసమంచితములుగా నున్నవి.

మం—దీని కేల యింత సిద్ధాంతపూర్వపక్షములు.

చం—శత్రుసేన మోసల్లడాసినప్పు డీగృహకల్లోలములఁ దలపోసికొన నేల?

శ్వే—మన సేనానాయకులతో కావలయు కార్యగతి యాలోచింతము.

దో—మీరు కొల్వుకూటముఁ జేరుతఱికి నేనును వచ్చి చేరెద.

మం—సోదరీమణీ! నీవు మాతోడ రమ్ము.

చం—ఏల?

మం—అది యస్మిభంగు లనుచితముగఁ దోఁచెడిని. దయసేసి రమ్ము.

చం—(స్వగతము) మీకౌటిల్యము నాకు గోచరించి. నేను మీతో రాశీ వలను పడదు.

[వారు నిష్క్రమించుచుండఁగా మారువేషముతో శ్వేతకీర్తి ప్రవేశించుచున్నాఁడు.]

శ్వే. కీ—నీవు నాబోటిదీనునితో సంభాషింప నిచ్ఛగింతువేని క్షణము తాళుము.

శ్వే. ధ్వ—ఇదె వచ్చెదను ఏమి నీపని?

(శ్వేతధ్వజుఁడు, శ్వేతకీర్తి తక్క తక్కినవారు నిష్క్రమించుచున్నారు.)

శ్వే. కీ—(ఉత్తరమం దిచ్చుచు)

మ. అనికిం బోవకపూర్వ మిందలి రహస్యార్థంబు వీక్షించి యం
దున నీకు స్సజయమైనఁ దక్షణమ చిన్నం జీరఁగా బంపు బం
పిన నే వచ్చి కృపాణపాణి నయి ఖల్మిం బోరి సాధింతు దీ
నను గన్పట్టు సమస్తరుం బ్రజుత నానాశూరమధ్యంబునన్.

ప్రవరమున నీపనిదీఱు నేని యంతతో నీపై జరుగుచున్న కుట్రలన్నియు దీఱఁగలవు. భగవంతుఁడు నిన్నాయుష్మంతుం జేయుగాత.

శ్వే. ధ్వ—నేఁ దీనిఁ జదువుకొనునంతవఱకు నిలవుము.

శ్వే. కీ—నిలువ వలనుపడదుగాని యవసరము పట్టినపుడు నాకై భేరి మ్రోయింపుము నే వచ్చెద.

శ్వే. ధ్వ—అయితే సరే. ఇదె నీపత్రికఁ జదువుకొనియెద. (శ్వేతకీర్తి నిష్క్రమించుచున్నాఁడు.)

[ద్రోహకుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ద్రో—శత్రుసైన్యము చూపు మేరలో నున్నది. ఇదె వారిసంఖ్యాసామర్థ్యముల వివరము. జాగరూకులయిన వారలఁ బుత్తెంచి తెప్పించితి. ఇఁక మీరు తడవు సేయఁ జనదు.

శ్వే. ధ్వ—జాగు సేయక సమరసన్నాహ మొనర్చెదము. (నిష్క్రమించుచున్నారు.)

ద్రో—శ్వాపదీయుగము క్రియ నొండొరులపై యసూయలు సేయు నీయిరువురకును మాట యిచ్చితిని. ఇం దెవ్వరి స్వీకరింతువాఁడ. ఉభయులను గ్రహింతునా? ఒకతె నా? లేక యుభయులను త్యజింతునా? ఉభయులు సజీవులయి యుండునంతవఱకు నా [illegible] అనుభవింప వలనుపడదు. అనాథను గ్రహింతునేని చంద్రిక చండకృశానుతుల్యయై మండిపడు. ఇదియునుం గాక చంద్రిక నాథునిం బ్రతిఘటించి నాయభ్యుదయము నిల్పుకొనఁజాలుటయు దుష్కరము. కానిమ్ము ప్రస్తుత మీతనిసాహాయ్యసంపత్తిచే జయలక్ష్మి వరసి, పిదప నాతనిఁ దీర్ఘనోప్రు నాపెం జేపట్టెద గాక. సుశీలామండపాలుర కీతఁడు సూచించ లంచు నను గ్రహించి యుద్ధము జయప్రదమయి వారలు నాచేఁ జిక్కినచో వారలం జేయుటెట్లు? నా కీదీర్ఘవిచారములతోఁ బనియేమి? కార్యంబు ధైర్యంబుతో నడుపుటయ నాపని. (నిష్క్రమించుచున్నాఁడు.)

రంగము—లోన కలకలము

ధ్వజతూర్యములతో సుశీలామండపాలురును వారిసైనికులును బ్రవేశించి నిష్క్రమించుచున్నారు.

[చంద్రసేనుఁడు శ్వేతకీర్తియుఁ బ్రవేశించుచున్నారు.]

శ్వే. కీ—ఆర్యా! యీచెట్టునీడ నిలిచి ధర్మోజయతుఁ అని యాశీర్వదించుచుండుము. నేఁ బ్రవికి వచ్చి నిన్నుఁ జేరఁగల్గుదు నేని నియోగక్షేమముల వహించెదను.

దో. చం—ఆయుష్మంతుడవై రమ్ము. పొమ్ము

(శ్వేతకీర్తి నిష్క్రమించుచున్నాఁడు)

[లోన కలకలము—శ్వేతకీర్తి ప్రవేశించుచున్నాఁడు]

శ్వే. కీ—ఆర్యా! కేలిటు లిమ్ము? రమ్ము పోదము. రాజు పరాజితుఁ డయ్యె. రాజునుం గొమార్తెయు నభిమాతులచేఁ జిక్కిరి.

చం—ఎక్కడకుఁ బోవలె. ప్రక్కట కీదోటు దగదా?

శే కీ—ఓహో! మరలఁ బూర్వాంతతోఁ బలుకుచుంటివా? జనునకు జన్మమరణములవిషయమున స్వాతంత్ర్య మెక్కడది. ఏది వచ్చినను సమ్మతించి తలయొగ్గవలసినవాఁడే.

చం—ఔ నదియు నిజమె. నిష్క్రమించుచున్నాడు.

రంగము—కురుక్షేత్రమున భారతసేనానివేశము.

[జయతూర్యములతోడను ధ్వజపటములతోడను దోషాకరుఁడును బందీకృతులయి
సుశీలామందపాలురును, సేనానియు సైనికులును బ్రవేశించుచున్నారు.]

దో—సేనానీ! ప్రభుచిత్తములు దెలియువఱకును వీరిని గొంపోయి తగురక్షణశాలలో నుంచుము.

సు—పుణ్యమునకుఁ బోయినం బాప మెదురైనది వసుధపై మన కొకరికే గాదు. తండ్రీ! నీనిమిత్తమయి వగపు దగిలియున్నదిగాని, ఖేద మెన్నఁడును నామది కెక్కట లేదు. మన మీపుత్రికారత్నములను సోదరీమణులను జూడఁగలయునా ?

మం—ఛీ! వాండ్రమొగము జూడనోప. మనమిఁకపురమున గారాగృహమున బంజరమందలి పక్షియుగ్మమువలె నొండొరుల గానగోష్ఠిం గాలక్షేపము సేయుఁదము. పురాతనాధునాతనవృత్తాంతముల నన్నిటిని స్మరణకుఁ దెచ్చుకొని యానందింతము. రాజకీయవ్యవహారములఁగూర్చియు ముచ్చటింతము. అధికారము దొలఁగినవారిని అధికారమునకు వచ్చినవారిని వారివారికృత్యములనుగూర్చియు చర్చింతము. దైవజ్ఞులవలె భవిరాజ్యాదర్శసిద్ధాంతముల నుపన్యసింతము. ప్రపంచమునందలి కల్లోలము కారాగృహకృత్యములు దూరి మనలం జేరనేరవు.

దో—వారిని దోడ్కొని పొమ్ము.

మం—అమ్మా! యిట్టిస్వార్థత్యాగములకు దేవతలు మెత్తురు మనుష్యమాత్రులు మనల నెడఁబాపఁజాల కుందురుగాత! (అని సుశీలను గౌఁగిలించుచున్నాఁడు.) అమ్మా కంటఁదడియొత్తి వెంటరమ్ము పోదము (రక్షితులై, సుశీలామందపాలురు నిష్క్రమించుచున్నారు.)

దో—సేనానికి లేఖ నందిచ్చుచు

శా. యోధాగ్రేసర దీనఁదోఁపెడు సముద్యోగంబు శీఘ్రంబుగా
సాధింపం దగు పారితోషిక మవశ్యం బందె దీ వియ్యెడన్
సాధుత్వంబు వహింతువేనియు వినాశం బాట తథ్యంబు నే
వాధర్మం బిది ఖడ్గపాణి యనుకంపావశ్యుఁ డైనం జెడున్.

సే—దేవా! మహాప్రసాదము. (నిష్క్రమించుచున్నాఁడు.)

[తూర్యములతో శ్వేతధ్వజుఁడు, చండిక, మందర మరియొక
సేనానియు భటులును బ్రవేశించుచున్నారు.]

శ్వే—శబాస్! ఈప్రొద్దు నీశౌర్యమునకు దైవము తోడ్పడియె. ప్రతిపంథులను బందీకృతులఁ జేసి తెచ్చితివి. వారిని నావశ మొనర్చుటచే వారిసౌఖ్యమునకు మనక్షేమమునకు ననురూప మగురీతిని వారి నాదరించెదను.

దో—రాజుయొక్క పలితశిరంబును ధర్మపక్షమును ప్రజలహృదయముల నాకర్షించి మనల కనర్థ మొనర్పనోపునని యాలోచించి సుశీలామందపాలుర నేకాంత నికేతనంబున సురక్షితులుగా నొనరించితిని. వారిసంగతి విచారింప మన కిది సమయంబు గాదు.

చ. పలువుర మిత్రబాంధవులఁ బాసినయుష్మలికంబు పెల్లునం
గలన జయంబు గేవల సుఖప్రద మాట నదిత్తఱి న్మనం
బులుపయి నాత్మప్రహతిని బ్రుంగుచు నగ్గున వారిఁ దోగు నా
జలజము లట్లు తాపమును సౌఖ్యము నొక్కట నందుచుండెదన్.

కావున పదంపడి యుక్తావసరంబున వారిపరామర్శకుం జొత్తము.

శ్వే—ఓయి! ప్రకృతివర్గములోనివాఁడ వగు నీ విట్లు సమానప్రతిపత్తిపూర్వకము భాషించెద వేల? చాలు, చాలు పెద్దపేలకము.

మందర—ఆతని సామాన్యవ్యాకలు మదుద్దేశాధీనములు. నీ వింతమూరము వలుకకున్న మాయభిప్రాయముల దెలిసికొనన మేలయ్యెండు. నాప్రతినిధిగా సేనల నడపి సర్వకార్యములు నిర్వహించిన యాతని నీసమానునిగా నేలఁ దెలియఁజాలవైతివి? ఇంత చేలతన ముండునే!

చం—నీ కేల నంత వేగిరపాటు? నీయధికార మేల? అతని కిట్టియాధిక్యత గల్పింప నతనిపరాక్రమము చాలదా?

మం—కాగాని నాయధికారముగూడ నతనిం జేరినచో నతని కీరాజ్యమున తుల్యుఁ డుండఁడు.

చం—నిన్నుఁ జేపట్టినంగదా యతని కట్టిగౌరవము గల్గుట?

మం—ఆహా! పేశన కాడినమాటలే నిజమగుటయుఁ గల్గునగదా!

చం—నీవైఖరిఁ గనిపెట్టుచునే యుంటిని.

మం—నాకేమో జబ్బుగా నున్నది. కానిచో నీకుఁ దగినయుత్తర మిచ్చియుందును. ఓశూరాగ్రణీ! నా సైన్యమును, సర్వస్వమును నన్నును నీయధీనము చేసికొని నీయిష్టానుసారము వినియోగపరచికొనుము. ఇదె సూర్యచంద్రులు సాక్షులుగ నీయధీనము చేయుచున్నదాన.

చం—అతనిం జేపట్టఁదలఁచితివా?

శ్వే. ధ్వ—వల దన నీవశమా?

దో—అయ్యో! వలదన నీతలమును గాదు.

శ్వే. ధ్వ—ఛీ! దాసీపుత్ర, యిదే వారించెదను.

మం—(దోషాకరునకు) నీవు నేఁ జేసినప్రతిజ్ఞను భేరి ప్రోయించి చాటఁ బంపుము.

శ్వే. ధ్వ—నిముసము తాళుము. దోషాకరా! రాజద్రోహము నాపాదించి నిన్నును ఈకచ్చెలక్రింద త్రొచుచు (చండికదెస జూపుచు) ఇదె నిగ్రహించుచున్నాను. ప్రియమయిన మరదలా! ఈతఁ డింతకుమున్నె నాభార్యకు మాటిచ్చియున్నాఁడు ఆ మెకయి పూని నే నీప్రార్థనకడ్డము పెట్టుచు నీకిష్టమయినచో నన్నె పెండ్లియాడుమని నిన్ను వేఁడుచున్నాను.

చం—ఆహా! ఈయుపాఖ్యానము సొగసుగానే యున్నది.

శ్వే. ధ్వ—దోషాకరా! నీ వాయుధపాణివైయే యున్నాఁడవు. భేరి వేయించెదను. ఈలేఖలో వివరింపఁబడిన నీద్రోహము నిర్ధారణచేయుటకీసేనలో నొకఁడును సన్నద్ధుఁడు గానిచో, నే నాపనికిం బూనెద. ఇదె నాప్రతిజ్ఞ.

మం—నాకు ప్రాణము మీఁదికి వచ్చినది.

చం—(స్వగతము) అట్లు గానిచో నోవధుల కెవ్వరు నమ్ముదురు.

దో—ఇదె నాప్రతిశపథము. నన్ను ద్రోహియను వానరాధముఁడు కేవల మృషావాదియు నీచహృదయుఁడునని ఖడ్గపాణినయి సిద్ధాంతీకరించెద. ఇదె నామాటగా భేరి ప్రోయింపుఁడు.

మం—నాకు ప్రాణము నిలుచునట్లు తోఁచదు.

శ్వే. ధ్వ—ఆపెను నాశిబిరమునకుఁ దోడ్కొనిపొండు భేరీమనుష్యునిఁ బిలువుఁడు. (మందరను దోడ్కొనిపోవుచున్నాఁడు.)

[భేరీ మ్రోయించువాఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ఓరీ! భేరీ మ్రోయించి దీనిం జాటుము.

భేరీవాఁడు—(మ్రోయించి చదువుచున్నాఁడు.) ఈసేనలో నీదోసాకరుఁడు ద్రోహియని వానితో ద్వంద్వయుద్ధమున గెలిచి నిర్ధారణ చేయఁజాలు క్షత్రియ సంజాతుఁ డున్నచో మూడవతూరి యీభేరి మ్రోగినతక్షణమే వెల్వడి రావలసినదిగా రాజాజ్ఞ.

దో—మ్రోయింపుము. మొదటి భేరీనాదము.

దో—మరల రెండవ భేరీనాదము.

దో—మరల మూడవ భేరీనాదము.

[లోపల భేరీమ్రోత—శ్వేతకీర్తి యుద్ధసన్నద్ధుఁడై భేరీ మ్రోయింపువాని ము న్నిడుకొని ప్రవేశించుచున్నాఁడు.]

శ్వే. ధ్వ—ఆవచ్చువాఁ డేల వచ్చుచున్నాఁడో తెలిసికొనుము.

భేరీమనుష్యుఁడు—ఎవఁడవు నీవు? నీపే రేది? కుల మేది?

శ్వే. కీ—ద్రోహముచే నా పేరు మాసినదిగాని నే మార్కొనువానికిం గులమున నించుకయుఁ దీసిపోను.

శే. ధ్వ—నీ వెవ్వరి మార్కొనియెదవు?

శ్వే. కీ—దోసాకరునికయి యెవఁడు పోరఁజొచ్చునో వానిని.

శే. ధ్వ—అల్లదె అతఁడు స్వయముగా కత్తి గట్టియున్నాఁడు.

శ్వే. కీ—ఒరనుండి బెరికి యడిదముం గేల నమర్చుము. నీయందు దోష మాపాదించి నే భాషింపఁబోవుపలుకులు నీహృదయంబునకు ములుకులయి బాధ యొనర్చినచో నీ చేతికరవాలముతోఁ బరిహరించికొనుము.

ఉ. ప్రాయితరాజ్యవైభవము ప్రాభవము న్భవదీయవిక్రమ
శ్రీయును జీరికిం గొనక చెప్పెద సత్యము ఖడ్గపాణివై
యీయఖిలప్రపంచమున నెయ్యెడ నీసరిద్రోయి లేఁడు తీ
క్ష్ణాయసఖడ్గధార యిది సాక్షిగఁ దెల్పెద నీవు గాదనన్.

క. ద్రోహివి తండ్రికి నన్నకు
ద్రోహివి దైవంబునకును ద్రోహివి మిత్ర
ద్రోహివి రాజద్రోహివి
ద్రోహివి నీ వెల్లయెడల దుష్టవిచారా.

దో—సమరధర్మమును రాజనీతియు విచారించినచో నే నీకులగోత్రంబులు దెలియువఱకును గయ్యమునకుఁ జొరకుండుటయే యుచితముగాని నీవేమ భావలయందుఁ

కోమనాటకికలెఁ జాడనట్టి విలంబమ్మునకు కారణమ పిశ్యాకొనఁ కున్నది.... నాయెడల
నా వివపలుకు లన్నియుఁ గల్ల లని నిన్నొప్పించుటకే దుఃఖ్యుఁడై యుంటుచున్నాఁడ.
శ్వేతనయిన నిలిచి మగటిమి చూపుము.

[పోరికిఁ జొచ్చుచున్నారు దోషాకరుఁడు నేల గూలుచున్నాఁడు.]

శ్వే. ధ్వ—కావుఁడు కావుఁడు.

సం—దోషాకరా! నీవిపనికిఁ బూననేకూడదు. వంచనచే నిన్నిందు దించి యూరకున్నను నింత సేసిరి.

శ్వే. ధ్వ—ఛీ! పిశాచమా నోరు మూయుము!— మూయవేని యాజాబుతో మూయించెద. దోషాకరా! చూడు మీజాబునీ ఘోరదోషముల బయలుపుచ్చుచున్నది. (చించ చింపఁబోవుచున్నది) పిశాచీ. చింపకుము. ఇదియెల్ల నీకు విశదమే యయి యుండు.

సం—అయిన నన్ను జేయువా రెవరు? నానిశ్చితమే శాసనంబుగ నుండ నన్ను శాసింపువాఁ డెవఁడు?

శ్వే. ధ్వ—ఛీ శాకినీ! అయితే ఇదియెల్ల నీయొక్కతో నడిచినదే.

సం—చెప్పుమాట లేల? నే నెఱుఁగనిది లేదు. (నిష్క్రమించుచున్నది.)

శ్వే. ధ్వ—ఆమె వెంటఁ జని చర్యలు గనిపెట్టుఁడు. సాహసమునకుం జొర బూనును.

దో—నీ వాడినదెల్ల నేఁ జేసినవాఁడ. ఇంకను నేఁ జేసిన దుష్కృతములు చెప్పఁజాలవు కాలక్రమమున నన్నియు బయలుపడును. అంతయు మించినది. నేను గతించుచున్నాఁడ. కాని నాకు నీపుట్టుపూర్వములు దెలియ నెంతయు కుతూహలము గలదు తెలిపి నావీనులకు విందొనర్పుము.

శ్వే. కీ—చ. మనము పరస్పరంబును సమాహితచిత్తము లొప్ప నీకుమా
విని మయు మిట్లొనర్చుటను బ్రీతి జనించెను. నాభిజాత్యమం
దున నొకపీసమంతయిన న్యూనత నాయెడ లేదు లేదు నీ
జననకే జనించితిని సాధ్వికి నాతనిధర్మపత్నికిన్.

గీ. దైవఘటన దలఁప తప్పక న్యాయమై
బరఁగు నుత్కటమగు పాపపుణ్య
ఫలము లీతనువునఁ బడయుజనుండు నీ
జనన మిందులకును సాక్ష్యమరయ.

దో—అన్నా! సత్యము పల్కితివి. నాకు కాల మాసన్న మయినది.

శ్వే. ధ్వ—నాయనా! నీనడకలోనే నీయాభిజాత్యము స్ఫురించినది. నీమాటలు శాపిస్తుల కాంతయు వింపొనర్చినవి. నీయెడ నాకెన్నఁడును ద్వేషము లేశమును లేదని దైవముసాక్షిగాఁ బల్కెద విశ్వసింపుము.

శ్వే. కీ—మహాత్మా! నేనది యెఱుంగుదును.

శ్వే. ధ్వ—అనఘా! నియజ్ఞాతవాసన మెట్లు గడపితివి నీతండ్రిదురవస్థ యెట్లు దెలిసితివి. నాకిది సవిస్తరముగా వినం గుతూహలం బయ్యెడు.

శ్వే. కీ—తెలిపెద నవధరింపుము. నాయుసురుగొనం బుట్టిన రాజశాసనము విన్నది మొదలు నిరంతరప్రాణభయాక్రాంతుఁడనై—అక్కటా! ప్రాణము లెంతతీపియో గాని మరణశేవనాతుల్య మగు ప్రాణభయమును బ్రతిక్షణమును భరింతుముగాని ఒక్కసారి యుసురు విడిచి ముక్తి గాంచ నోపముగదా. అక్కడక్కడఁ దిరుగుచుం దుదకు నీచజంతువులకైనను వెక్కసముగా నోపు వికారవేషము గైకొంటిని. ఆస్థితిలో గళితమణులసొమ్ములలక్కగూడుల పాలుపు వహించి రక్తధార లొలుకు రిక్తనేత్రములతో మాతండ్రి నాకుం దారసించిన నే నాతని నడపుచు, ననునయాలాపంబుల నతని యాత్మహత్యాప్రయత్నంబు లుడిపితిని గాని, యది యేమిబుద్ధి మోహమో యాతనికి నన్నుం దెలిపికొనవైతి, కడకు గడియక్రిందటనే నీయుద్ధమునకు సన్నద్ధుఁడవై వచ్చుతెఱంగుపదర్శనప్రాప్తివిషయకసంశయమునం జేసి నన్నుం దెల్పికొని పూసగ్రుచ్చినట్లు నావృత్తాంత మెల్ల దెలిపితి. ఈకథ వినునప్పు డతనియంతరంగమునం జిరగొను ఖేదమోదము లాముదుకని జీర్ణహృదయము నవియించెంగాని, ఱాతఁ జేయఁబడినదేమో నాహృదయ మవియకున్నయది.

దో—నీకథ నాహృదయమును గరగించుచున్నయది. నీ వింకేమో చెప్పఁదలఁచినట్లు నాకుఁ దోఁచినది. చెప్పుము. నాహృదయమును గొంత మందికిఁ బదనుపడ వచ్చును.

శ్వే. ధ్వ—నాహృదయ మిదివరకే నీరై పోనున్నది. ఇంకను విచారకరమైన దున్నచో విరమింపుము. నాగుండె తాళఁజాలదు.

శ్వే. కీ—సహృదహృదయమున కిదియే చరమావధిగా నోపు-నైనను మానవదుఃఖమున కొక చరమావధిలేనట్లు దోఁచుచున్నయది. అపారదుఃఖపారావారమగ్నుడనై నేనున్న యత్తఱి నొకవృద్ధుఁ డక్కడికేతెంచి, నన్నును నాదుఃఖమును గుర్తెఱింగినవాఁడు గావున నన్నుం గౌగిలించికొని బ్రహ్మాండకటాహము వీటలువారునట్లు పెద్దపెట్టున

వాక్రందనముసేసి, మాతండ్రి శవముపైఁబడి యేడ్చుచు, రాజుదుర్వస్థ దెల్పుచు పరవశుఁడై యుండఁగా యిక్కడ భేరి రెండుమారులు మ్రోసెను. అంతట నే బయలుదేరి వచ్చితిని.

శ్వే. ధ్వ—అయితే యా పెద్ద మనుష్యుఁడెవఁడు.

శ్వే. కీ—రాజుచే వెడల నడపఁబడియు, మారువేషమున నాయన కొల్వుఁ జొచ్చి బానిసెలుసైతము సేవగించు నూడిగములు సేసిన సుమిత్రుఁడు.

[రక్తముతో నెల్లుచగుకత్తి చేబూని యొక పెద్దమనుష్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

పె—రక్షింపుఁడు రక్షింపుఁడు.

శ్వే కీ—ఎట్టిరక్షణగావలె ?

శ్వే. ధ్వ—పలుక వేల !

శ్వే. కీ—రక్తముతోఁడి యాకత్తి యెక్కడిది ?

పె. మ—నులివెచ్చనిరక్తముతో నది పొగ లెగయుచున్నది చూడుఁడు. ఆరక్త మాపెహృదయమునుండి వచ్చినది. అక్కటా ఎంతలో నాపెకు కాలము సరిపోయినది !

శ్వే. ధ్వ—ఆపె యెవరు ? పలుక వేల ?

పె. మ—అయ్యా ! మీరాణి, ఆమెతోఁబుట్టువునకు విషము నెట్టి తాను కత్తివాతబడినది. విషము పెట్టినట్లామెయే యొప్పుకొనినది.

వో—నా రద్భుతమును నాహృదయమును సమర్పణ సేసితిని. మఃవ్వరమును శీఘ్రముగఁ గూడెదముగాక.

శ్వే. కీ—ఇదె సుమిత్రుఁడు వచ్చుచున్నాఁడు.

శ్వే. ధ్వ—ఊపిరి యున్నను లేకున్నను వారిశరీరముల నిటకుం దోడ్కొని రండు. ఈశ్వరునియొక్క యీ ఘోరచర్యలు మనల మేనులను వడఁకించుచున్నవిగాని మనహృదయములకు జాలిగొలుపకున్నయవి.

(పెద్దమనుష్యుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

[సుమిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ఓహో ! ఇతఁడే నా సుమిత్రుఁడు అహా ! కాలవైపరీత్యము. ఈతనికి సామాన్యసత్కారమైన జూప వలనుపడ కున్నయది.

సు—అయ్యా ! మా రాజు ననుజ్ఞగొనిపోవవచ్చినాఁడ నతఁ డేఁడ ?

శ్వే. ధ్వ—అయ్యో! ఎంతపరాకు పడితిమి! దోషాకరా! సుశీలామందపాలుర నేమి న్జేసితివి? సుమిత్రుఁడా; ఈవిపరీతము చూచినావా?

[చండి కామందరల శరీరముల లేఁబడుచున్నవి.]

సు—అయ్యో! ఏల యిట్లు?

దో—ఈ భయములను నాయందు బద్ధానురాగులై యొకతె రెండవదానికి విషమిచ్చి తాను బొడుచుకొన్నది.

శ్వే. ధ్వ—ఔ నట్లే. వాండ్ర ముఖములఁ గన్పడు.

దో—నా కవసానము సమీపించినయది నాప్రకృతి నుల్లంఘించినట్టియైన జన్మలో నొకశుభప్రకృతి సేయ నిశ్చయించినాఁడ. కోటకు సత్వరముగా నొకని నంపుఁడు. వధ కుత్తరువు సేసి సుశీలామందపాలుర నక్కడకు పంపియుంటిని. కార్యము మించకుండ నంపుఁడు.

శ్వే. ధ్వ—పరుగెత్తుము. పరుగెత్తుము.

శ్వే. కీ—ఎక్కడకు? ఎవరివద్దకు? అభిజ్ఞానపత్రిక లేదా?

దో—నీమాట లెంతయు నుచితములు. నాకత్తి గైకొని నాసేనానియొద్దకు సత్వరముగ బొమ్ము.

శ్వే. ధ్వ—పరుగెత్తుము. (శ్వేతకీర్తి నిష్క్రమించుచున్నాఁడు.)

దో—సుశీల నురిదీసి యామెయే యాత్మఘాతంగముచే నరిపెట్టుకొనెనని ప్రకటింపవలసినదిగా నేనును చండికయు నాలుసేసి యుత్తరువు లొసంగి సేనానియధీనము సేసి సుశీలామందపాలురను గోటకుఁ బంపితిమి.

శ్వే. ధ్వ—భగవంతుఁడు రక్షించుగాత. వీని నిటనుండితోడ్కొని చనుఁడు.

(దోషాకరుని మోసికొని పోవుచున్నారు.)

[సుశీలయొక్క మృతశరీరమున సందిటఁ బెట్టుకొని రాజును, శ్వేతకీర్తియు, సేనానియు మరికొందరును ప్రవేశించుచున్నారు.]

మం—వాపోవ నేల? మీగుండెలు ఱాతఁజేయఁబడె గాఁబోలు. మీనోళ్లు నాకుండిన మిన్నువిటలువార రోదనసేయనా! అయ్యో; నానిక్షేప మనుగంటిపోయెనే. కొనయూపి గైనను లేకపోయెగా. అద్దమొకటి దీసికొనిరండు. ఊపిరిపరీక్ష చేయుదము.

సుమి—అకటా! నేఁడు ప్రళయదినముగాఁ గన్పట్టుచున్నది.

శ్వే. కీ—అట్లే తోఁచుచున్నది.

శ్వే. ధ్వ—మిన్ను విఱిగిపడి ప్రపంచప్రళయ మౌగాక!

మం—అమ్మా! ఈవెంద్రుక కదలుచున్నది. ఇది నిజమైన నాకష్టమ్ములు గట్టెక్కఁ గలవు.

సు—మహాప్రభూ! (పాదప్రణామము సేయుచున్నాఁడు)

మం—తొలఁగిపొమ్ము. పొమ్ము.

శ్వే. కీ—అయ్యా! అతఁడు భవత్ప్రియమిత్రుఁ డగుసుమిత్రుఁడు.

మం—ఛీ ఘాతుకులారా! మీవలననే దీనిప్రాణములు దాటిపోయినవి. మీ రీచింతను రాకుండిన రక్షించుకొనియుందు. అయ్యో! తల్లీ! ఎంతలో భంగ పెట్టితివి.

శా. అమ్మా! సాధ్వి రో! దీనవత్సల! సుశీలా ధాత్రిన్నైఁ జెన్నిధా
వమ్మై నన్నుఁ జిరంబు ప్రోతువనుచు న్నాకుండు విశ్వాస మీ
విమ్మాడ్కి న్నృపుఁగా నొనర్తువని నే నెద్దుం దలంప న్నిమే
షమ్మైనం దడయంగ రాదె యిట నస్మత్సన్నిధిం బుత్రికా.

తల్లీ! నిన్నురిదీయు నాపాపకర్మ నొకవేటు నఱికితినిగాని నినుం దక్కించు కో నేరనైతి.

సేనాని—నిజమే వాని నఱికినాఁడు.

మం—నఱుకలేదఁటరా దుర్మతీ? నాకాలమున నేఁ గరవాల మెఱనఁడి ఱెక్కి కేల నమర్చినతోడనే వైరిశిరములు వేనవేలు భూమి నలంకరించెడిని. మున్నన నాకు వచ్చినకష్టములచే నాజవసత్త్వ లుడిగినవి. నీ వెవ్వఁడవో చెప్పఁగల్గుదు నేమో ప్రయత్నించెదను.

సుమి—కష్టము లనుభవించుటయందు నిపుణమునం బ్రపంచమున నీకు సాటి నీవే గన్పట్టుచున్నావు.

మం—నాకన్నులు గానజాలవు. నీవు సుమిత్రుఁడవు గావా?

సు—చిత్తము మహాప్రభూ. దేవరపరిచారకుఁ డేడ?

మం—వాఁడు మంచివాఁడు. వాఁడు నావిపత్కాల బడదన్నటులోఁ జాల నేర్పరిగా నుండెను. ఇపుడు చచ్చి స్వర్గమునుండబోలు.

సు—అయ్యా! వాఁ డన్యుఁడు గాఁడు. వాఁడే నేను.

మం—సరే చూతము లే.

సు—నీప్రథమదురవస్థనాఁడు మొదలు నీపాదసేవ సేయుచు—

మం—నీకు స్వాగతము.

శ్వే. కీ—అయ్యో? నేలఁ గూలుచున్నాఁడు.

సుమి—హా దయామా! అలిసిపో వేల.

శ్వే. కీ—అయ్యా! కను విచ్చి చూడుము.

సు—చింతలచేఁ జివికి క్రుంగిగిరాలినాఁడు. ఆయన యాత్మస్వార్థ్యమునకు భంగము సేయకుము.

శ్వే. కీ—అంతా అయిపోయినది.

సుమి—కా కేమున్నది. ఇంతవఱకు నిలుచుటే నా కాశ్చర్యముగఁ గన్పట్టెడు.

శ్వే. ధ్వ—వారిని దోడ్కొనిపొండు. సుమిత్ర శ్వేతకీర్తులారా! ఇఁక విచారమే మనపాలు కాటికిఁ బోవువరకును గర్మము మానదు. పరమాప్తులగు మీసాహాయ్యముచే నే నీరాజ్యభారనిర్వహణమందు గొంత యూరట గాంచెద.

సుమి—నేనును నాయజమానునిపజ్జకుం బోవలె. (నిష్క్రమించుచున్నారు.)

శ్వే. కీ—మనమిట్లు జేలపడవలదు. ఐహికసుఖదుఃఖములయందు పరమార్థభ్రాంతి చేసి ఖేదమోదము లందుట పామరలక్షణము. ప్రాజ్ఞుఁడు సుఖదుఃఖములను లాభాలాభములను జయాజయములను గణింపక ఫలాభిసంధి వర్జించి ధర్మ మాచరింపవలెను. (ఉభయులు నిష్క్రమించుచున్నారు.)